# రాగమయి

( ఖండ కావ్యం )

కొందఱినిజూడ స్నేహంబు గోరు మనము
కొందఱినిజూడఁ దొలఁగిపోఁగోరుచుండు
రాగము విరాగమును జీవరాశులందుఁ
గలుగుటకుఁ గానరాదెట్టి కారణమ్ము

శోభిరాల సత్యనారాయణ

సత్యనారాయణ గ్రంథమాల
ద్వితీయ కుసుమము

సర్వస్వామ్య సంకలితము
ప్రథమ ముద్రణము – 1000 ప్రతులు
మూల్యము : 5 రూ.

ఆనంద గ్రీష్మము – 1974 జూన్

పబ్లిషర్ :
కె. ఆనందవర్ధన
సబ్-ఎడిటర్, ఆంధ్రప్రభ
విజయవాడ.

ముఖచిత్రం :
శ్రీ పోలవరపు నారాయణమూర్తి, శ్రీకాకుళం
గీతా సుబ్బారావు, విజయవాడ

ముద్రణ :
*భారత ముద్రణాలయం, విజయవాడ-2.*

ప్రతులకు :
1. పబ్లిషర్
2. Ippili Chittibabu Sons
Book Sellers
SRIKAKULAM

# ప్రవేశిక

ఒకనాడు కాకతీయాంధ్ర సామ్రాజ్యాన్ని పాలించిన రాణి రుద్రమ జీవితంలో మరువరాని ఒక 'మధుర స్మృతి'ని ఇతివృత్తంగా చేసికొని వ్రాసిన ఖండకావ్యం ఈ 'రాగమయి'.

రాకుమారి రుద్రమ రసార్ద్ర హృదయంలో భద్రమైన ముద్ర వేసికొని ఆమె అభిమానానికి అనురాగానికి పాత్రుడైనవాడు రాజ శిల్పి రామప్ప. 'గజరాజు' అతని సంకేత నామం.

గణపతిదేవ మహారాజుల ఆజ్ఞానుసారం గజరాజ శిల్పి పాలం పేట వద్ద శివాలయ నిర్మాణం చేస్తుంటాడు. ప్రప్రథమంగా అతడు చెక్కిన అందాల నందిని చూడడానికి జనం తండోపతండాలుగా వస్తుంటారు.

ఆ సమయంలో అందటి వలెనే అతని శిల్పాలను చూడవచ్చిన ఒక వామనయన సౌందర్యానికి ముగ్ధుడైన రామప్ప ఆమె రూపురేక లను తన విగ్రహాలలో మూర్తీభవింప చేస్తాడు.

రాలలో తన ప్రతికృతులను జూసి తన్మయత్వం చెందిన తరుణీ మణి తత్కారకుడైన రామప్పపై ప్రేమాభిమానాలు పెంచు కుంటుంది.

ఆ సౌందర్య రస తరంగిణి సాన్నిధ్యంలో తన జీవితం సార్థకం చేసికోవాలని కలలు గంటూ డా కళారాధకుడు.

కాని గజరాజ శిల్పి హృదయాన్ని కదిలించి కమనీయ కళా సృష్టికి కారణభూతురాలైన కాంతామణి భువన మోహినియైన యువ రాణి రుద్రమ కావడం ఆయన దురదృష్టం.

రాజకీయ కారణాలవల్ల రుద్రమదేవి మళ్ళీ ఆ శిల్పిని కలిసి కొనలేకపోతుంది. గణపతిదేవులు దివంగతులు కావడం – సామ్రాజ్య రక్షణ భారం తనపై పడడం – దేశంలో చెలరేగిన కల్లోలాల నణచడానికి కంకణం కట్టుకోవడం – ఇవన్నీ వారి పునస్సమాగమానికి ప్రతిబంధకా లవుతవి.

ఇప్పుడామె మహారాజ్ఞి.

ప్రశాంత పరిస్థితులు నెలకొన్న కొంతకాలానికి శిల్పాచార్యుణ్ణి కలిసికోవడానికి పాలంపేట విచ్చేసిన రాణీ రుద్రమ ఆ దేవాలయం లోని శిల్పాలనూ అమరనారీ విగ్రహాలనూ చూచి ఆనందాతిరేకంతో తబ్బిబ్బవుతుంది. కాని తన అంతరంగంలో శీతలాగ్ని శిఖలు రగిలించి తనను వశ్యురాలను చేసికొన్న కళారాధకుడు లేకపోవడంతో శోక సంతప్తురాలై తన ప్రారబ్ధానికి పరితపిస్తుంది.

రామప్ప శిల్పి అధ్వర్యంలో నిర్మింపబడిన ఆ శివాలయాన్ని ఇప్పుడు "రామప్ప గుడి" అంటారు. సమీపంలో ఉన్న ఆ సరోవరాన్ని "రామప్ప చెఱువు" అంటారు.

రామప్ప గుడిలో అడుగిడగానే అపూర్వ నాట్యభంగిమలతో ఆహ్వానించే సాలభంజికలనూ, అద్భుత కళాఖండాలనూ చూచి అచ్చెరువంది అద్వితీయమని ప్రశంసించిన ఇటలీదేశ యాత్రికుడు మార్కో-పోలో ఈ విచిత్ర విషాదగాథ విని, అచ్చటి స్త్రీమూర్తులకు మూల ప్రకృతి అయిన దివ్యకాంతను, ఓరుగల్లులో సింహాసనాధిష్ఠరాలై సాక్షాత్తు సింహాసనేశ్వరివలె కొలువుదీరి కూర్చుండిన కాకతీయాంధ్ర సామ్రాజ్ఞి రుద్రమదేవిలో చూచి ఆశ్చర్యపోతాడు.

ఈ విషయాన్ని దాదాపు 16 సంవత్సరాల క్రితం శ్రీ "రామ్ చంద్" అనే ఆయన "కిన్నెర" అనే పత్రికలో ప్రకటింపబడిన ఒక వ్యాసంలో వెల్లడించారు. అయితే అందులో ఆయన గజరాజశిల్పి

తన మనస్సు నాకర్షించిన రమణీమణి రాణి రుద్రమ యని తెలిసికొని భగ్న హృదయుడై, ప్రణయోద్వేగంతో ఆ దేవాలయ శిఖరంనుండి పడి ప్రాణత్యాగం చేసికొన్నట్లు, ఆ సమయానికి పరిణయ కాంక్షతో ప్రణయ శీలియైన శిల్పిని ఓరుగల్లు కొనిపోవడానికి వచ్చిన రుద్రమదేవి ఒడిలోనే ఆయన అసువులు బాసినట్టు వ్రాశారు.

ఈ కావ్యకర్త శిల్పి విషయత్యాగంచేసి వెడలిపోయినట్లు మార్చి వ్రాశారు.

పాలంపేట ప్రాంతంలో ప్రజలు అనుశ్రుతంగా చెప్పుకొనే కథ ఇది.

చారిత్రకంగా చూస్తే ఈ కథ క్రీ॥శ॥ 1255 నుండి 1265 సంవత్సరాల మధ్య జరిగినట్లు ఊహింపవచ్చు. అంతకుమించి వ్రాస్తే అనవసరమైన చారిత్రక విమర్శ చేసినట్లవుతుంది.

ఈ ఇతివృత్తాన్ని ఆధారంచేసికొని ఈ కావ్యకర్త అనేక శాస్త్ర రహస్యాలు నిగూఢంగా నిక్షిప్తం చేసినట్లు తోస్తుంది.

శిల్ప దర్శకురాలైన కాత్యాయని అన్నట్లు

*ఎన్నియొ కళారహస్యము లిందుఁగలవు*
*కలవు కలలెన్నో కమనీయ గాథలిందు;*
*ఎఱుఁగ నవియెల్ల నేను నీ కెఱుక పఱుప*
*తెలిసికొను మావ యోచించి ధీరచిత్త !*

అని మనవి చేస్తూ, ఈ మధుర కావ్యం సహృదయుల మన్నన లందుకో గలదని ఆశిస్తున్నాను.

ఈ కావ్యాన్ని ప్రతిఫలాపేక్ష లేకుండా ప్రచురణార్థం నా కొసంగిన కావ్యకర్తకు నా కృతజ్ఞతలు.

విజయవాడ,
21–6–74

కె. ఆనందవర్ధన
(పబ్లిషర్)

# రాగమయి

## కావ్యానుశీలనము

చారిత్రక సంఘటనలను కథా వస్తువుగా స్వీకరించి రచింపఁబడిన కావ్యములు ఆంధ్రభాషయందు చాల అరుదుగా కానవచ్చుచున్నవి. తెలుఁగులోని ప్రబంధ సాహిత్యము ఇంచుమించుగా నంతయు రాజకుమారులయు లేక దివ్య పురుషుల యొక్కయు అద్భుత కృత్యములకు, శృంగారలీలలకు మాత్రమే పరిమిత మయిన దనుట సాహసము కాదను కొందును. సామాన్యమానవుని జీవన సమస్యలు ఆంధ్ర ప్రబంధములలో కేవలము ఉపాఖ్యానములుగా మాత్రమే అంగీకృతము లైనవి. ఒకానొక శిల్పి లేక కళాకారుని వ్యక్తిగత జీవితమును ప్రధాన కథా వస్తువుగా స్వీకరించి వర్ణించిన కావ్యములు ఆంధ్రభాషయందు మృగ్యములనుట అతిశయోక్తి కాదు.

ఈ 'రాగమయి' కావ్యము నందలి విశిష్టత యేమన - ఇందలి ఇతి వృత్తము చరిత్రకు సంబంధించినది. ఇది కాకతీయ యుగము నాటి కథ. ఇందలి నాయకుడు ఒక శిల్పి. అతని పేరు రామప్ప. అతడు భగ్న ప్రేమికుడు. అతడు మలచుచున్న శిల్పములను రాణి రుద్రమాంబిక యొకసారి దర్శించును. ఆమె సౌందర్యము చిత్రమైనది. అందు స్త్రీ సహజమైన కోమలత్వము కలదు; చక్రవర్తిని యందు భాసించు ఔద్ధత్యము కలదు. ఆమె సుందర స్వరూప సాక్షాత్కారము పొందిన రామప్ప హృదయ ఫలకమునందు ఆమె మూర్తి చెరగని ముద్రవేసినది. అతని యధ్వర్యము క్రింద నిర్మితమైన ఆలయమునిండ ఆమె మూర్తిని అనేక భంగిమలలో ఆ శిల్పి మలచి ఆమె యతిలోక సౌందర్యమునకు నివాళు లర్పించుకొనును. కాని చిత్రమేమన ఆమె కాకతీయ సామ్రాజ్ఞియని యాతఁ డెరుగఁడు. కొంత కాలమునకు ఆ సత్యము అతనికి తెలిసి వచ్చును. ప్రాంశు లభ్యమైన ఫలమునకై ఉద్బాహుఁడగు వామనుని స్థితివంటిదైన తన స్థితిని తలఁచుకొని యతఁడు లజ్జితుఁడై ఉన్నయూరు విడచి యెచ్చటికో ఒక అజ్ఞాత ప్రదేశమునకు వెడలిపోవును. ఈ విషయమును తెలిసికొనిన రుద్రమ హృదయము కరుణ రసార్ద్రీభూతమగును. శిల్పి నిష్కల్మష ప్రణయముచే ప్రభావితురాలైన రుద్రమకు అతని యెడల సానుభూతి, ప్రేమ ఇదివరకే యున్నవి. కాని రాజకీయ కారణములు ప్రతిబంధకములు కాగా రుద్రమ

తన ప్రేమ తనలోనే యణచికొనవలసి వచ్చును. స్థూలముగ చరిత్రకు సంబంధించి నంతవరకు కథ ఇది. ఈ కథ ఇది వరకే నాటక రూపమునను, నవల రూపమునను ప్రచలితమైనది. నేటికి ఈ కథ కావ్యమును దాల్చినది.

"రాగమయి" కావ్యమునందలి రచనయంతయు సంప్రదాయము ననుసరించియే యున్నది. ఇది నిర్వచనము. సాంప్రదాయిక ఛందములే ప్రయుక్తములైనవి. శైలి ఇతి వృత్తమునకు అనురూపముగ సరళ సుందరముగ నున్నది. సమాసరచన అక్లిష్టముగను నాతి దీర్ఘముగను ఉండుటచే ఒక విధమగు అనిర్వచనీయ శ్రవణ సుభగత్వమును సాధించుకొన్నది. రామప్ప గుడి యందలి అద్భుత శిల్పములను రుద్రమ దర్శించునప్పుడు ఆమె కన్నుల యెదుటనిలచిన నగ్ననాగిని శిల్పము ఈ క్రింది విధముగా వర్ణింపబడినది :

*లలితోద్గ్రాహ కరద్వయాప్త ఫణియున్ గ్రైవేయకాళీ విష*
*మ్ముల, బాహుద్వయ లంబమాన విలసద్భూషా భుజంగములున్*
*బొలుపారన్ భుజగేంద్రుపై నిలచి వంపుల్ సొంపులున్ బోవునీ*
*యలరుంబాయపు నగ్ననాగిని వ్యాళీకావేశమున్ గాంచితే !*

ఈ కావ్యము నందలి "శిల్పదర్శనము" అను శీర్షిక క్రిందనున్న పద్యములు చాల విలక్షణములైనవి. రామప్ప గుడి యందలి శిల్ప విశేషములను రుద్రమకు కాత్యాయని చూపు ఘట్టము ఈ భాగమునందు వర్ణితమైనది. దేవాలయమునకు వచ్చిన రుద్రమను చూడఁగనే కాత్యాయని ఆశ్చర్యచకితయైనది.

*తెలియని రహస్య మేదియో తెలిసినట్లు*
*కనులు మిల మిల లాడ సగౌరవముగ–*

ఆమె దేవాలయము నందలి సుందర శిల్పములను రుద్రమకు చూపి వర్ణించును. ఆమె తెలిసి కొనిన రహస్య మేమనఁగా ఆ శిల్ప మూర్తులలో ప్రతిబింబించు మూలాకృతి తన యెదుట నున్న మహారాజ్ఞియే యని.

*ఏ విగ్రహములు గనిన నా*
*కే విధమగు రూపురేకలే వెలయునహో !*

దేవాలయము నందలి నంది, నాసికాప్రతిములు, నర్తకీ వ్రాతము, గజలక్ష్మి, శివలీలలు, కృష్ణలీలలు, రాధామాధవులు – ఇట్టివే ఎన్నో శిల్పములు పఠితల కన్నుల గట్టునట్లు వర్ణింపఁబడినవి.

కావ్యమునందంతటను ధారాశుద్ధి ప్రస్ఫుటముగా కానవచ్చుచున్నది. చూడుడు :

కాంచెము కాంచెమా ఎడఁదకున్ సరిదాకుచువచ్చి ప్రాక్తనో
దంచిత పుణ్యరూప వనితా ప్రియతా రజితాద్రిశృంగ మె
క్కించి సరాగమాడుచు మృగీ నయనాంచల మొక్కమారు దొ
ర్లించితే? తత్ప్రపాత పతితేప్సితు రాగవిదూరుఁ జేయుచున్

ఎచ్చటను రచన ప్రయత్నపూర్వకము చేయబడినట్లు కానరాదు.

శిల్పి భావోద్వేగమును సందేహ వ్యాకులితమైన రుద్రమ చిత్తమును కవి చక్కఁగా వర్ణించినాఁడు. రుద్రమను చూడగనే రసార్ద్రమైన శిల్పి హృదయక్షేత్రము నందు ప్రేమ అయరించినది. అదియొక విధమగు మనఃస్థితి; అతర్కితోపపన్నమైనది.

సుభగ సుందర రూపమ్ము చూచినపుడు
మృదు మధురమైన గీత మాలించినపుడు
హృదయము ద్రవించి స్పందించు నేవనికైన
సహజమగు పూర్వజన్మ వాసనల వలన

ఈ చక్కని పద్యమునకు మూలమగు కాళిదాసు శ్లోకమిది :

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని

ఈవిధముగా కనిపించియు కనిపించక దర్శనమిచ్చిన యూహాసుందరి మూర్తినే పెక్కు భంగిమలలో మలచి శిల్పి తృప్తి చెందినాఁడు. తరువాత యాదృచ్ఛికముగా తన యూహాసుందరి మరియొకమారు సాక్షాత్కరించినపుడు తన ప్రేమను అతడు ప్రకటించుకొనును.

చిలుక, గోరువంక–బంగారువన్నె లేడి, కృష్ణసారము–భ్రమరకాంత, మధువ్రతము–ఈ జంటలన్నిటియందు ఆ యజ్ఞాత స్త్రీమూర్తిని, తనను ఊహించుకొని శిల్పి తన్మయుండగును. తనయెడల వైముఖ్యమున్నట్లు ఆమె ప్రవర్తనఁ బట్టి శిల్పికి తోచును. తనయందు ఆమెకు సౌహార్దమున్నట్లనియే అతఁడు భావించుకొనును.

*ఆమె పలుకదు గాని, లజ్జారుణాస్య*
*కలికి చూపులె తెలుపు నా కలికి తలఁపు*

కాని తాను కోరిన ప్రకారము ఆమె తనకు చేరువగా మాత్రము వచ్చుటలేదు. అట్టి యదృష్టమునకై యతఁడు నిరీక్షించుచునే యుండును. ఆమెయందు శిల్పికి కల్గిన ప్రేమభావము పవిత్రమైనది. కామదూషితము కాదు.

*ఒకరిని జూడ నార్ద్రమగు నుల్లము; వెండియు వారిఁజూడ వే*
*డుక గలుగున్; యథేచ్ఛగ నటుల్ దమకమ్మునఁజూడఁ జూడ గో*
*రిక జనియించుఁ; గోర్కి పలురీతుల వ్యక్తమగున్; ఫలాప్తి కు*
*త్సుకతను జూపు మోహము; విశుద్ధ మనమ్మునఁ బ్రేమ వర్ధిలున్*

తనకు ఆయజ్ఞాత సుందరి యందుదయించిన ప్రేమ అవ్యాజమనుటకు అతఁడు కొన్ని దృష్టాంతముల నిచ్చుచున్నాఁడు :

*విరులవి యెన్నియున్నఁ గనిపెట్టి మధువ్రతమేల పద్మినీ*
*పరతఁ బరిభ్రమించు? శతపత్త్రము మిత్రుని జూచినన్ విక*
*స్వరమగునేల? ఏల కలువల్ వికసించుఁ గలానిధిన్ గనన్*
*బరఁగ బరస్పరానుగత భావరహస్య మెరుంగవచ్చునే !*

ఈ పద్యమునందలి ప్రయుక్తములైన మూఁడు పదములు సార్థకములు – అవి 'మధువ్రతము;' 'మిత్రుడు;' 'కళానిధి' అనునవి. ఈ మూడు పదములు రామప్ప రసైకలోలుఁడనియు, సౌహార్ద భావభరితమానసుఁడనియు, కళోపాసకుఁడనియు సూచించును. అట్టివే 'పద్మిని', 'శత పత్త్రము', 'కలువ' అను పదములు. రుద్రమ పద్మినీ జాతి స్త్రీ యనియు, ఆమె సోగకన్నులు శత పత్త్ర దళములవలె సుందరము లనియు, ఆమె కలువపువ్వువలె అసూర్యంపశ్య యనియు లజ్జావనతముఖి యనియు సూచించును. ఆమె మహారాజ్ఞియని తెలిసికొనిన వెంటనే తన భావములను ఒకలేఖ యందు నిక్షేపించి శిల్పి యదృశ్యుఁడగును. ఇది అతని కరుణామయ గాథ.

తన స్వరూప సౌందర్యములు ప్రస్ఫుటమగునట్లు మలఁచఁబడిన శిల్పములను చూచి రుద్రమ ఆనందించినది. మీదు మిక్కిలి ఆ శిల్పి వెలువరించిన ప్రణయ భావములచే పులకితయైనది. కాని స్త్రీ జన సహజమైన గడుసుఁదనము మాటలలో కనఁబరచుచు నిట్లనినది:

ఎవరిచ్చినారు చనవులు
యువతుల శిల్పముల మలచి, యున్నత భావ
ప్రపణల గుణగణ్యుల నిటు
వివిధోజ్జ్వల విరల భావ విస్ఫూర్తులఁజేయస్

ఇది నిజమైన ఆగ్రహముకాదు. ప్రేమతో కూడుకొనిన కుహనా భర్త్సనము. ఇట్టివే మరికొన్ని 'మృదు మధురోక్తులఁ దనమనమించుక తెలియఁబలికి'నది. ఆమె సామ్రాజ్ఞి యగుట చేత తన మనోగత భావములను స్పష్టముగా శిల్పి యెదుట నుంచలేకపోయెను. ఇట్టి యామె సంకటస్థితిని కవి ఈ విధముగా వర్ణించినాఁడు.

నీ దరిఁ జేరుదుస్ మనసు నిల్వక, తియ్యని నీదు నెయ్యముస్
గాదనలేను-చేరువయి కాంక్షలు దీరఁగ నిన్ను గూడి స
మ్మోదముఁ జెందలేను— వలపుందలఁపుల్ పాలించలేను — స్వా
మీ! దయ నీయురాలను క్షమింపుము-చూపుము సాదరమ్మునస్.

రుద్రమ తన స్థితిని గూర్చి మరియు నిట్లను చున్నది:

పరుల గుండెలు చీల్చి నెత్తురులుఁ ద్రావు
జాతిలోఁబుట్టి పెరిగెడు దాననేను;

రాజకుమారి, నందు యువరాజ్ఞిని, నిన్నెటు చేరవత్తునో
యోజన చేయుమోయి!

ఈ మాటలన్నియు రుద్రమ నేరుగా శిల్పితో నన్నవి కావు. అవి కేవలమామె స్వగతములే.

ప్రణయభావ
శబలితాహ్లాద చిత్తయై చనెడు వేళఁ
ద్రోవ పొడవున రుద్రమ దేవి యొదవ
గుప్త రాగ సౌరభ్యముల్ గుప్పుమనియె

ఇందలి 'గుప్తరాగ' పదములోని శ్లేష సహృదయైక వేద్యము. భగ్నప్రేమికుఁడైన శిల్పి అదృశ్యుఁడైన పిదప రుద్రమ మనః స్థితి "అనుతాపము" అను శీర్షిక క్రింద వర్ణితమైనది.

ఎంత సుకుమార మాతని యెదద! ఎంత
మధురమాతని ప్రణయమ్ము!!

అందుకనియే రుద్రమ హృదయ వీణ శిల్పి ప్రణయ గీతములకు అనుగుణముగా ధ్వనించినది.

ఎవ్వరేమను కొన్న నాకేమి యనుచు
వానిఁగనబోవు చుండెడి దాననెపుడు
సమయ విస్ఫూర్తి మిత్ర తేజమ్ముఁజూచి
ముదముఁగను ప్రొద్దుతిరుగుడు పూవ్వువోలె

చక్కని యుపమానము. రాచరికపు మర్యాదలు, సంప్రదాయములు వారిరువురి సంయోగమునకు అధిగమింపగరాని ప్రతి బంధకములు.

నీ నెనరెంచి, యొక్కపరి నిన్నభిమర్శన చేసిపోవఁగా
నైనను వీలులేక, విరహాగ్ని భరింపఁగరాని వేదనల్
లోన దహించుచుండ - మదిలోఁగొనఁజాలని నెయ్యురాల
నీ దాననే - యేమి చేయగలదానను? దుర్విధియడ్డు వచ్చినన్.

—అని రుద్రమ తన సామ్రాజ్ఞీత్వమునే నిందించుకొనుఁనును.

మనసులోని వ్యథలు మరులు తెల్పఁగ లేక
గుండెరాయి చేసి కొంటి నోయి
రాచపుట్టు వయిన రమణి జీవిత మొక
పంజరంపుఁజిలుక బ్రతుకు గాన.

మహారాజ్ఞియైన రుద్రమకు తన వైయక్తి కానందము కన్న దేశక్షేమమే ప్రధాన కర్తవ్యము. అందుకనియె తన ప్రేమను తనలోనే ఇముడ్చుకొని, పంజరములోని చిలుకవలె జీవితమును గడుపుటకన్న ఆమెకు గత్యంతరము లేకపోయెను. చిట్ట చివరకు ఆమె నుండి వెలువడిన ప్రణయ విశ్వాసమిది:

..............................నాదగు సర్వమున్ సమ
ర్పణ మొనరించి నీపదములం బడియుందు రజఃకణంబునై

కాకతీయ సామ్రాజ్యమునకు చక్రవర్తినియై, పరులకు గుండెగాలమై. ఏకవీరాదేవికి మారురూపమని ప్రసిద్ధివడసిన రుద్రమాంబికను ఇట్టిస్థితికిఁ దెచ్చినది రామప్ప శిల్ప కళా వైశిష్ట్యమా లేక అతని ముగ్ధప్రణయమా? రెండు నని చెప్పఁకొనవలెను. తన ప్రేమ నిష్ఫలమని గ్రహించిన వెంటనే శిల్పి యదృశ్యుఁడై నాఁడు. రుద్రమకు అట్టి యజ్ఞాత ప్రదేశములకు వెడలిపోయి తన హృదయవేదనను ఏకాంతముగా అనుభ

ఎవరిచ్చినారు చనవులు
యువతుల శిల్పముల మలచి, యున్నత భావ
ప్రవణల గుణగణ్యల నిటు
వివిధోజ్జ్వల విరల భావ విస్ఫూర్తలఁజేయన్

ఇది నిజమైన ఆగ్రహముకాదు. ప్రేమతో కూడుకొనిన కుహనా భర్త్సనము. ఇట్టివే మరికొన్ని 'మృదు మధురోక్తులఁ దనమనమించుక తెలియఁబలికి'నది. ఆమె సామ్రాజ్ఞి యగుట చేత తన మనోగత భావములను స్పష్టముగా శిల్పి యెదుట నుంచలేకపోయెను. ఇట్టి యామె సంకటస్థితిని కవి ఈ విధముగా వర్ణించినాఁడు.

నీ దరిఁ జేరుదున్ మనసు నిల్వక, తియ్యని నీదు నెయ్యమున్
గాదనలేను-చేరువయి కాంక్షలు దీరఁగ నిన్ను గూడి స
మ్మోదముఁ జెందలేను– వలపుందలఁపుల్ దొలగింపలేను -- స్వా
మీ! దయ నీయురాలను క్షమింపుము-చూడుము సాదరమ్మునన్.

రుద్రమ తన స్థితిని గూర్చి మరియు నిట్లను చున్నది:

పరుల గుండెలు చీల్చి నెత్తురులుఁ ద్రావు
జాతిలోఁబుట్టి పెరిగెడు దాననేను;

రాజకుమారి, నందు యువరాజ్ఞిని, నిన్నెటు చేరవత్తునో
యోజన చేయుమోయి!

ఈ మాటలన్నియు రుద్రమ నేరుగా శిల్పితో నన్నవి కావు. అవి కేవలమామె స్వగతములే.

ప్రణయభావ
శబలితాహ్లాద చిత్తయై చనెడు వేళఁ
ద్రోవ పొడవున రుద్రమ దేవి యెడద
గుప్త రాగ సౌరభ్యముల్ గుప్పుమనియె

ఇందలి 'గుప్తరాగ' పదములోని శ్లేష సహృదయైక వేద్యము. భగ్న ప్రేమికుఁడైన శిల్పి అదృశ్యుఁడైన పిదప రుద్రమ మనః స్థితి "అనుతాపము" అను శీర్షిక క్రింద వర్ణితమైనది.

ఎంత సుకుమార మాతని యెడద! ఎంత
మధురమాతని ప్రణయమ్ము!!

అందుకనియే రుద్రమ హృదయ వీణ శిల్పి ప్రణయ గీతములకు అనుగుణముగా ధ్వనించినది.

ఎవ్వరేమను కొన్న నాకేమి యనుచు
వానిఁగనబోవు చుండెడి దానసెపుడు
సమయ విస్ఫూర్తి మిత్ర తేజమ్ముఁజూచి
ముదముఁగను ప్రొద్దుతిరుగుడు పూవ్వువోలె

చక్కని యుపమానము. రాచరికపు మర్యాదలు, సంప్రదాయములు వారిరువురి సంయోగమునకు అధిగమింపగరాని ప్రతి బంధకములు.

నీ నెనరెంచి, యొక్కపరి నిన్నభిమర్శన చేసిపోవఁగా
నైనను వీలులేక, విరహాగ్ని భరింపఁగరాని వేదనల్
లోన దహించుచుండ - మదిలోఁగొనఁజాలని నెయ్యురాల
నీ దాననే - యేమి చేయగలదానను? దుర్విధియడ్డు వచ్చినన్.

—అని రుద్రమ తన సామ్రాజ్ఞీత్వమునే నిందించుకొనుఁనును.

మనసులోని వ్యధలు మరులు తెల్పఁగ లేక
గుండెరాయి చేసి కొంటి నోయి
రాచపుట్టు వయిన రమణి జీవిత మొక
పంజరంపుఁజిలుక ప్రబతుకు గాన.

మహారాజ్ఞియైన రుద్రమకు తన వైయక్తి కానందము కన్న దేశక్షేమమే ప్రధాన కర్తవ్యము. అందుకనియె తన ప్రేమను తనలోనే ఇముడ్చుకొని, పంజరములోని చిలుకవలె జీవితమును గడుపుటకన్న ఆమెకు గత్యంతరము లేకపోయెను. చిట్ట చివరకు ఆమె నుండి వెలువడిన ప్రణయ విశ్వాసమిది:

.......................................నాదగు సర్వమున్ సమ
ర్పణ మొనరించి నీపదములం బడియుందు రజఃకణంబునై

కాకతీయ సామ్రాజ్యమునకు చక్రవర్తినియై, పరులకు గుండెగాలమై, ఏకవీరాదేవికి మారురూపమని ప్రసిద్ధివడసిన రుద్రమాంబికను ఇట్టిస్థితికిఁ దెచ్చినది రామప్ప శిల్పి కళా వైశిష్ట్యమా లేక అతని ముగ్ధప్రణయమా? రెండు నని చెప్పఁకొనవలెను. తన ప్రేమ నిష్ఫలమని గ్రహించిన వెంటనే శిల్పి యదృశ్యుఁడైనాఁడు. రుద్రమకు అట్టి యజ్ఞాత ప్రదేశములకు వెడలిపోయి తన హృదయవేదనను ఏకాంతముగా అనుభ

వించు నదృష్టమైనను లేదు. అందుకని రామప్ప స్థితికన్నను రుద్రమ స్థితియే యెక్కువ దయనీయమైనది. పతితలకు ఆమెయందే ఎక్కువ సానుభూతి కలుగును.

ఈ కావ్యమునందు ప్రయుక్తములైన కొన్ని యుపమలు చాల విశిష్టమైనవి. స్నేహపూర్ణులైన సంగడికాండ్రు చిమ్మనగ్రోవులెత్తి వసంతము చల్లగా :

*నింగినిదాఁకె పుష్పాడులు*
*నెయ్యపు గుండెలమంటలో యనన్*

అని ఉత్ప్రేక్షింపబడినది. రుద్రమ దరహాసములు :

*సెలయేటిపైన వెన్నెల*
*వెలుగుల వలె*

ఉన్నవఁట. శిల్పి రుద్రమ చేయిపట్టుకొని రమ్యప్రసూన నికుంజమునకు చేర రమ్మనినపుడు :

*ఆనందానుభూతిన్ మన*
*స్విని చిత్తమ్మున నింద్రకార్ముకము వాల్చెన్ చిత్రభావాకృతిన్.*

శరచాప మందేవిధముగా అనేక వర్ణ సమున్మీలనము గోచరించునో అట్లే ఆమె హృదయాకాశమున చిత్రచిత్ర భావపరంపరలు ఉదయించినవని కవిభావన. 'శిల్ప దర్శనము' అన్న శీర్షిక క్రింద :

*వినిపింపని గీతమ్ములు*
*మనముల నలరించు మధుర మధురములగుచున్*

అని చెప్పఁబడినది.

"Heard melodies are sweet, but those unheard
Are sweeter"

అన్న Keats వాక్యములకిది ప్రతిధ్వని.

"రాగమయి" కావ్యము పరిమాణమందు చిన్నదైనను గుణమునందు దొడ్డది. ఇట్టి సుందర కావ్యమును సంతరించిన శ్రీ శోభిరాల సత్యనారాయణగారిని హృదయపూర్వకముగా అభినందించుచున్నాను. వారు మున్ముందు ఇట్లే అనేక వినూత్న కావ్యకుసుమములచేత భాషాదేవిని పూజింపఁగలరని ఆశించుచున్నాను.

శ్రీ కె. పి. నారాయణరావు, బి. ఎ., బి. యల్.,
10-1-1974
జిల్లా & సెషన్సు జడ్జి, శ్రీకాకుళం.

# అంతర్వీక్షణము

ఓరుగల్లున కాకతీయాంధ్ర సామ్రాజ్య సింహాసనము నధిష్ఠించి (1262-1296) ఈ దేశమును పరిపాలించిన రుద్రమదేవియొక్క సొంత గృహస్థ జీవితమునకు సంబంధించిన అనుకూలపడని ఒక చిన్న మరులుతీగ భావముయొక్క రేఖా చిత్రముగా ఈ కావ్యము వ్రాయబడినది.

వరంగల్లుజిల్లా పాలంపేటవద్ద రామప్ప దేవాలయము, రామప్ప చెఱువు అని మహాప్రసిద్ధములయిన నిర్మాణములు కలవు. రామప్పదేవాలయమనగా దానిని కట్టిన మహాశిల్పి రామప్పయని కొందరందురు. అందలి శివుడు రామలింగేశ్వరుడు. ఆయనయే రామప్పయని కొందరందురు. ఈ రెండిటికిని పెద్ద ప్రమాణములు లేవు. జనవాక్యం తు కర్తవ్యం. రామలింగేశ్వరు డన్నపేరుమీద విచారించినచో ఒకరి నౌకరు కాదనుకొనవలసిన పనిలేదు – ఏదైన ప్రబలమైన త్రోసిరాజనుటకు వీలుకాని ప్రమాణము ప్రత్యక్షముగా లభించినచో తప్ప. శిల్పి పేరు రామప్ప అని ప్రారంభించినచో కూడ కాదనవలసిన దంతగా లేదు. కాని లోకములోని వారు మనుష్యులు కదా!

ఈ కావ్యము రామప్ప శిల్పియని యెత్తుకొనుచున్నది. కావచ్చును. అంతవరకైనచో ఇబ్బంది లేదు. ఈ శిల్పసామ్రాజ్య సింహాసనాధిష్ఠితుడైన రామప్పను, కాకతీయాంధ్ర సామ్రాజ్య సింహాసనాధిష్ఠితయైన–అప్పటికి కాకపోయినను, కానున్న–రుద్రమదేవికి అభిముఖముచేసి మరులు తీగను సోకించి కావ్యమును చేయుటను కవి సంకల్పించినాడు. మరులు తీగ తాకుడు పనిచేయలేదు. అది పర్యవసానము. పర్యవసానమును కల్పించిన హేతువు కావ్య పాఠకులయందు సానుభూతిని ప్రేరేపింపవలయును. ఈ ప్రేరణ కలిగించుటయందే కవియొక్క పనితనము కలదు.

ఈ కావ్యమున పాత్రలిద్దరు. ఇద్దరు లేనిచో కథయేలేదు. ఆ యిద్దరను నిలబెట్టిన కవి పాత్ర యెట్లును అనివార్యముగా నుండనే యున్నది. మరొక్క చిన్న పాత్రను కవి కల్పించినాడు. ఆమెపేరు కాత్యాయని. ఆమె యెట్టిదనగా రఘువంశములో ఇందుమతికి చెలికత్తె లేదా అట్టిది. నైషధీయ చరితమునందు ప్రత్యక్షమైన శారదాదేవి

వంటిది. అక్కడ వారా నాయికలకు స్వయంవరమున నాయక పురుషులను వర్ణించి సహాయపడిరి. ఇక్కడ కాత్యాయని నాయకుని గాక తత్కృత మహాశిల్ప విన్యాస విశేషములను వర్ణించి పరంపరయా నాయికా హృదయము నాయకునియందు అనుకూలముగా ప్రవహించుటకు సహాయపడినది. పంచనశీ ఘట్టమును వర్ణించిన శారదాదేవిని చూచి ఈ కవి ఈ కాత్యాయనిని కల్పించి యుండవచ్చును. చూడకపోయి యుండవచ్చునుకూడ.

ప్రధానపాత్ర లిద్దరలో రుద్రమ దేవికి చరిత్రయున్నది. రామప్పకు చరిత్ర లేదు. మహాయున్నచో జనశ్రుతియున్నది.

చారిత్రక పురుషులను, పురాణ పురుషులను అన్యధా కల్పించి కావ్యములయందు ప్రదర్శించుట అంతసులభమైన పనికాదు. కాదనుటకు శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి, శ్రీ గుడిపాటి వేంకటచలం - వారి పుస్తకాలేచాలును. మధురను పాలించిన మంగమ్మకలదు. మధుర మంగా పుంశ్చలీ విలాసమును వ్రాసినవాడును కలడు. చారిత్రక పురుషులనగా పురాణ పురుషులనగా వారిని గూర్చి మరొక విధముగా చెప్పి జనమును మెప్పింపలేవని యర్థము. మరొక విధమనగా అప్రసిద్ధమైన విధమని. మహా ప్రజా స్వరూపమైన దేశకాలములు ఆయా కథా పురుషులను ఆయా సుప్రసిద్ధ కథా శరీరములతో తప్ప మరొక విధముగా చూడవు. నీవు చూపింపవలయునను కొన్నను అవి కలిసిరావు. సుప్రసిద్ధ కథా శరీరములను కవులు కాలాంతరముల యందు మరియు సముజ్జ్వలము చేయవచ్చును. అది కవికి కలిసి వచ్చును. కాళిదాసాది మహా కవులందరును అట్లదృష్టము పట్టినవారే. అన్యధా కల్పన మన్నచో కవి మిక్కిలిగా జాగ్రత్త పడవలయును.

రుద్రమదేవి యున్నది గనుక ఇది చారిత్రక కావ్యమా ? కావచ్చును. రుద్రమ దేవి శిల్పిని ప్రేమించినదా? ప్రేమించి యుండవచ్చును. పెండ్లికూడ చేసికొన వచ్చును. ఎడ్వర్డు ప్రభువు ఎవరినో ప్రేమించి పెండ్లిచేసికొన్నాడు కదా ! పెండ్లి అయినది గనుక అక్కడ కథ పుట్టలేదు. రుద్రమదేవికి శిల్పితో కాలేదు గనుక ఇక్కడ కథ పుట్టినది. కథ పుట్టినదనగా కావ్యము పుట్టిన దన్నమాట. అగుచో ఈ కావ్యమునకు ప్రాణభూతమైన స్పందనశక్తి పెండ్లి కాలేదు గనుక అన్నదాని ధహరాకాశమునం దాడుచున్నది కావలయును. కవియొక్క కృషి యంతయును తాదృశమైన చైతన్యాగ్ని శక్తిని ప్రజ్వలింపించి కావ్యమును జ్వాలా మాలా పరివృత్తముగా చేయుటయందు ఫలింపవలయును. ట్రాజెడీ అనగా నప్పుడు.

అంతకంటె ముందొక్క విషయమున్నది. రామప్ప చారిత్రక పురుషుడు కాదు గనుక అతడెప్పుడైనను ఉండవచ్చును. ఈ కావ్యముయొక్క అవసరమును బట్టి రుద్రమదేవికి ఈడైనవాడు కావలయును. రుద్రమదేవికి ఈడు వచ్చునప్పటికి రామప్ప దేవాలయ నిర్మాణము కొనసాగుచుండవలయును. శిల్పి కాదుగాని రుద్రమ దేవి, రామప్ప దేవాలయము చారిత్రక సత్యములుకదా! రామప్ప దేవాలయమును గణపతిదేవుడు కట్టించినాడా? రుద్రసేనాని అను రెడ్డి సామంతుడు (1162) కట్టించి నాడా? రుద్రసేనాని కట్టించినచో ఆ కాలమున రుద్రమదేవి లేదు. ఆమె లేనిచో ఏమియును లేదు. రుద్రమదేవి పుట్టినతరువాత గణపతిదేవ చక్రవర్తి రామప్ప దేవాలయ నిర్మాణమును చేయించినాడన్నచో రుద్రమయును, ఆ శిల్పియును సమ కాలము వారగుటకు వీలుచిక్కును. అప్పుడుకూడ శిల్పి రుద్రమకు ఈడువాడు కాక చాల పెద్దవాడైయుండును. అది యెట్లయినను కథపుట్టుటకు వీలున్నది. కథ పుట్టినది గనుక కావ్యము వచ్చినది గనుక ఆ వీళ్ళన్నియు సమకూడినట్లుగా భావింపవలయును.

అయినచో ఈ కావ్యము ట్రాజెడీయా? ఈ దృశ్యమైన కథ ట్రాజెడీ కానిచో మరేమియునుకాదు. ఎవరి ముఖముగా దీని ట్రాజెడీ లక్షణమును కావ్యపాఠకు లను భవింపవలయును? రుద్రమదేవి ముఖముగానా? శిల్పిముఖముగానా? రుద్రమదేవి వైపునుండియే మనము చూడవలయును. శిల్పిముఖముగా చూడరాదా? చూడవచ్చును. బాహ్యమును, అభ్యంతరమును అయిన సంఘర్షణమునకు, సంక్షోభమునకు ఆస్పద మైన పాత్ర విషయముననే ట్రాజెడీకాని అందరి విషయముననుకాదు. మహోదాత్తము లయిన పాత్రలయందే ట్రాజెడీని నిరూపించినదందువల్లనే. రుద్రమదేవిని ప్రేమిం చుటకుగాని, పెండ్లిచేసికొనుటకుగాని శిల్పి పక్షముగా వచ్చెడు ఆటంకములులేవు. శిల్పిని ప్రేమించుటకు, పెండ్లిచేసికొనుటకు రుద్రమదేవి పక్షమునుండి వచ్చెడు ఆటంకము లన్నియిన్నికావు. ఆటంకములనధిగమింపవలసి వచ్చుటచేత, అందు కవకాశములు లేకపోవుటచేత సంఘర్షణమునకు, సంక్షోభమునకు రుద్రమదేవి పాత్రయందున్న వసతి శిల్పి పాత్రయందులేదు. నాయికా నాయకులీ కావ్యమున సమ స్థానీయులు కారు. రుద్రమదేవికి శిల్పి దిగుదల. శిల్పికి ఆమె ఎగుదల. ప్రవాహ మునకు ఎదురీది ఎందును కాకుండ కొట్టుకొని పోవుట కష్టముకాదు. దిగుదల కురవడించెడి ప్రవాహము నరికట్టుట కష్టము. అందువల్ల రుద్రమదేవి ముఖముగా తీవ్రతరమైన భావప్రవాహమును అనివార్యమైన ఒకానొక విధి సేతువుచేత బంధించి

సంక్షోభమును సృష్టింపవచ్చును. అట్లు ట్రాజెడీని సృష్టింపవచ్చును. ఇంతటిసంక్షోభమును శిల్పి యందు సృష్టించుటకు వీలులేదు. అతడు సామాన్యుడు. ఒక రాజ్యమునకు ప్రభువు కాడు. రుద్రమదేవి సామాన్యురాలు కాదు. ఆమె ఈ ఆంధ్ర మహా సామ్రాజ్యమునకు ప్రభ్వి. ఆమె అట్టిది గనుకనే ఈ కావ్యము వ్రాయబడినది. ఇద్దరు సామాన్యులే అయినచో కథలేదు. మనమెంత చెప్పినను శిల్పికి రుద్రమదేవితో వివాహము కాలేదని విచారపడువాడుండడు. రాజకుమార్తెను ప్రేమించిన సామాన్యుని లోకము పిచ్చివాడనును. శిల్పి పిచ్చివాడని నిరూపించుటకు కాదు కదా కావ్యము వ్రాయబడుచున్నది? అందువల్ల ఈ ట్రాజెడీ రుద్రమదేవి ముఖముగానే అనుభవ యోగ్యముగా చేయబడవలయును.

## II

అసలీకావ్యము ట్రాజెడీ కాదు. కాకుండ కవి తీసికొన్న జాగ్రత్తయే ఈ కావ్యరచనము నందున్న విశేషము. భక్తి మూడువంతులు స్త్రీ పురుష విరహ భావాభి వ్యక్తిగా నుండు లక్షణము కలది. భక్తుడు భగవతియైనను, భక్తురాలు భగవంతుడు అయినను వారివారి మధ్యగల భక్తి సంబంధము శృంగార సంబంధముగా కని పించును. శృంగారమును ఇట్లు భక్తిగాగాని, అటు జ్ఞానముగా గాని పరిణమింప జేయుటకున్న వీలును కనిపెట్టి ఈ కవి ఈ వస్తువును స్వీకరించి ధైర్యముచేసి ఈ కావ్యమును వ్రాసెను. పైకి కనిపించు శృంగారము వెనుక భక్తిజ్ఞానము లున్నవి గనుక ఈ కావ్యము ట్రాజెడీ కాలేదు. అయినట్లనిపించును.

రుద్రమదేవి రామప్ప శిల్పివద్దకు వచ్చిన మొదటి సన్నివేశమును కవి యిట్లు వర్ణించినాడు :

*తన యుపాస్య దేవతయె కళాలక్ష్మయై*
*వాంఛ దీర్ప నెంచి వచ్చినట్లు*
*తలచె శిల్పి హర్ష కలిత చేత శ్శిఖి*
*కనులు విప్పి క్రమగతుల నాడ*

*ఆకళా తపస్వి యా జగన్మోహిని*
*గాంచినంత రూపకల్పనమున*
*నెదియొ క్రొత్త యంద మెద సందడింపంగ*
*జెక్కఁ దొడగె బ్రతిమఁ జకిలి చేసి*

# XVII

భసిత రుద్రాక్ష మాలికా భద్రుడైన
స్థపతి రాణ్మణి వదన తేజంబు చూచి
నిర్వి కారతయును గళానిరతిఁ జూచి
నిర్వృతిం జెంది రాపడి నిలిచె నెలఁత

రతి వచ్చి ప్రక్క నిలిచిన
మతిసెడి నిజపత్ని నెఱుగ మదనుండైనన్
సతమతమగునట్లు రతి
ప్రతిమను నిర్మించె స్థపతి ప్రతిభామతియై

జీవకళ లుట్టిపడ రతిదేవి మూర్తి
దిద్ది తీరిచి ప్రాణ ప్రతిష్ఠఁజేసి
తిరిగి చూచిన లేదట దివ్యకాంత
యమర శిల్పములో లీనమాయె నేమొ!

ఆ చపలాయతాక్షి వదనాంబుజ మింతకుమున్న యెన్నడో
చూచిన యట్లు తోచు, నెట జూచితినో మరి జ్ఞప్తిలేదు గా
నీ చిరకాల మైత్రి మది నిల్చిన రూపము నేడు నాకు దృ
గ్గోచరమై నవద్యుతులు గూర్చె నటంచుఁ దలంచె శిల్పియున్.

వచ్చినది వయస్సులో నున్న రుద్రమదేవి. ఆమెను కవి యెట్లు చెప్పుచున్నాడు? శిల్పియొక్క ఉపాస్యదేవత తదాకారము ధరించి వచ్చినది. శిల్పి శ్రీ మహాకళాలక్ష్మి ఉపాసకుడు. భగవతి శ్రీ లలితా పరమేశ్వరి కళావతి. ఆమె కళారూప. కళానిధి. ఆమెయే రుద్రమదేవిగా అవతరించినదా ? కావచ్చును. కానిచో ఆమెను చూడగానే ఆ శిల్పికి పరా భట్టారిక ఎందుకు మనస్సుకు రావలయును ? రుద్రమదేవి పరమేశ్వరి యొక్క అవతారమని అట్లు సన్నివేశమును కల్పించి తదర్థము యొక్క ప్రతీతికి దోహదము చేయుచున్నాడు. ఆయన భక్తుడు. జగన్మోహిని ఆ భక్తుని ఇష్టదైవము. జగన్మోహిని యనగానేమి ? పరమేశ్వరి ఈ జగత్తును మోహమున ముంచుచున్నది. మోహిని యెట్లో అట్లే మోహనాశిని అనియు అమ్మవారి నామములలో కలదు. రుద్రమదేవిని చూపించి కవి ఆమెను జగన్మోహిని అని యెందు కనుచున్నట్లు ? శిల్పి విషయమున మోహమునకును, మోహ నాశనమునకును ఆమెయే హేతువు. రుద్రమదేవినిచూచి శిల్పిహృదయము వికారమునకు గురికాలేదు. అతని కళానిరతి చెదరలేదు. రుద్రమదేవిలో తన ఇష్టదైవమును దర్శించిన శిల్పి ఆ దివ్య తేజమునకు రూపకల్పన

చేయుట కుపక్రమింపగా సిద్ధమైన శిల్ప మెవరిది? రతీదేవిది. రతీదేవి యెవరు? పరమేశ్వరి. ఆమెకు రతిరూపా అన్నదొక పేరు. ఆమె రతిప్రియకూడా. రతిరూపము సరే. మన్మథుని ప్రసక్తి యెందుకు? శ్రీ దేవి ఉపాసకులై శ్రీ విద్యా ప్రస్తారముచేసిన ద్వాదశ మహోపాసకులలో మన్మథుడొకడు. పరమేశ్వరి ఇట్లుండును – ఇట్లుండదు అనిలేదు. ఆమెరూపము నెరుగుట అంతటివానికిని అంతటిసులభముకాదు. తాదృశమైన రూపమును శిల్పి చెక్కినాడు. తన ఉపాసనా బలముచేత ఆ రూపమును దర్శించినాడు. చెక్కినాడు. అనగా శిల్పి అమ్మవారియొక్క రతి రూపమును చూడగల్గినాడన్నమాట. అంతవరకే ఆమె వానిని అనుగ్రహించినది. రుద్రమదేవి దివ్యకాంతయా? కాదు. ఆమె యందు దివ్య కాంతను శిల్పిచూచినాడు. ఆ దివ్య కాంత ప్రాణశక్తి శిల్పమున దింపబడుటచేత తిరిగి చూడగా దివ్యకాంత లేదు. అది నెపముగా కవి రంగము నుండి రుద్రమదేవిని తొలగించినాడు. తాను చూచిన ఆమెను శిల్పికి అంతకు పూర్వమెప్పుడో చూచినట్లున్నదట. ఎప్పుడు చూచినాడు? పూర్వజన్మలో కావచ్చును. మంత్రమూర్తియైన శ్రీ దేవతను తాను మనస్సుచేత నిరంతరము చూచుచునే యున్నాడు. అట్టి ధ్యానమువలన మనస్సున మూర్తిగట్టిన రూపమిప్పుడు చర్మచక్షువులకు విషయమై యుండవచ్చును. చిరకాలమైత్రి మది నిల్పిన రూపము నేడు నాకు దృగ్గోచరమైనదని శిల్పి చెప్పుచునే యున్నాడు కదా!

ఇప్పుడు శిల్పి యెవరు? ఇప్పుడు రుద్రమదేవి యెవరు? ఒక భక్తుడు – ఒక దేవత. దేవత మానవాకారమున వచ్చినది. భక్తుడు చూచినాడు. దేవతావిరహము ననుభవించినాడు. దేవత భక్తుని చూచినది. దేవతలకు కూడ కర్మగతి దాటరాదు. అందువలన రుద్రమదేవి దేవతగా శిల్పికి ప్రత్యక్షముగా ప్రసన్నము కాలేకపోయినది. దేవతకు భక్త విరహము. ఇది వాత్సల్యము. దేవతాభిముఖమైన భక్తుని భక్తియు, భక్తజనాభిముఖమైన దేవత వాత్సల్యమును అభివ్యక్తియందు పైకి శృంగారమట్లు కనిపించును. ఇది లోపల. ఇది కాదుకదా అన్న స్ఫూర్తి కవికి రచనయందెల్లవేళలను మేల్కొనియుండనిచో కావ్యమున శృంగారము సులభముగా అల్లుకొనిపోవును.

కాముని పున్నమ జాతరలో రుద్రమదేవియు, శిల్పియు రెండవసారి కలుసుకొన్నారు. ఇప్పుడు శిల్పి అప్పటివలె నిర్వికారుడు కాదు. రుద్రమదేవి గమనించినది. "నన్నుజూచి మోహమున చిత్తవికారము నందె"తి వేమనుచున్నది. దానిమీదట శిల్పి యనుచున్నాడు.

*ఎంత కాలముగనొ ప్రతీక్షించుచుండ*
*నాకు ప్రత్యక్షమైతి వీనాడు దేవి !*
*వదలుదునె నిన్నుఁ గోరిన వరము లిచ్చి*
*చెలువములు చూపి చరితార్థుఁ జేయువరకు ?*

*ఈ సరస్తీరమునఁ బూవుటీరమందు*
*ఫుల్ల కుసుమాంగనామోదములు సెలంగి*
*కామితార్థములొసఁగ నేకాంత సేవఁ*
*బూలఁ బూజింతురమ్మ! శంపాలతాంగి!*

ఇట్లు శిల్పిని నిలబెట్టి కవి చిత్రముగా రుద్రమదేవి మనస్సును మానవీకరించి వికార మును ప్రదర్శించుచున్నట్లుగా దేవతలుకూడ కర్మాధీనులన్న విషయమును ప్రధానము చేసి వర్ణించి ఆ సన్నివేశమునుండి ఇరువురను ఇరువురుగా తొలగదీయ గలిగినాడు.

నిరీక్షణ ఖండమున శిల్పి విరహ వర్ణనమున గల ఈ పద్యములు గమనింప దగినవి.

*క్రీగంటి చికిలి చూపుల*
*మ్రోగింతువు వీణ, చంద్రముఖి, గానకళా*
*ప్రాగల్భ్య మెల్ల జూపుచు*
*రాగసుధా మాధురీ సరస్వతి వగుచున్.*

*పంటపొలమునఁ గల క్షేత్ర పాలు కొరకు*
*వామహస్తమ్ముతో హేమవర్ణ పాత్ర*
*భక్ష్య భోజ్యములను గొనివచ్చుచుండు*
*నమృత హృదయిని యగు విశాలాక్షి యెవరు ?*

*కనుపింతువు కనుమూసినఁ*
*గనిపింపవు కన్నుఁ దెఱచి కాంచినయంతన్*
*గనుకట్టు విద్దెలో నే*
*ర్పును జూపెదొ? తరుణి, కామరూపిణి వగుచున్*

సరస్వతి, విశాలాక్షి, కామరూపిణి, తరుణి ఈ శబ్దములన్నియు సాధారణములై యున్నట్లుండి ప్రకరణబలముచేత రుద్రమదేవియందు కవి సంభావించిన భగవతిని ఉపలక్షించుచున్నవి. ఏకాంతమున విరహవేదనానుభవములో శిల్పికి రుద్రమ సరస్వతిగా, కామరూపిణిగా అనిపించుచున్నప్పుడు శృంగారమును చెప్పవలయునా?

భక్తిని చెప్పవలయునా? శృంగారము కనిపించుచున్నదని భక్తి స్ఫురించుచున్నదని చెప్పవలయును.

శిల్పదర్శనమునకు వచ్చిన రుద్రమదేవిని కవి భావజుని రాణి, అతిలోక సుందరి, శివపదహృదయా సుందరాంగి అని సంబోధింపజేయుటలోను జాగ్రత్త యున్నది. శిల్పి యుపాసకుడని ఆయన ఉపాస్యదైవతము తానేనని తాను శ్రీ పరమేశుని అవతారమని రుద్రమదేవికి వ్యక్తావ్యక్తముగ తెలిసినట్లు కవి యొక పద్యమును వ్రాసినాడు.

తనరూపె కన్పించుఁ దమిఁ జెంచు తేని బు
　　జాన వ్రాలిన బోయ సానియందు
దన సోయగమె తోఁచి తనియించు నందాల
　　దేవిఁ బోలిన రతిదేవియందుఁ
దన రాచఠీవియే కనిపించు దర్పాన
　　మగవేసమున నున్న మగువ యందుఁ
దన యపూర్వాంగ సౌందర్య రేఖలె తోఁచు
　　నమరనారీ విగ్రహముల యందుఁ

దన మనోహర రూప సందర్శనమునఁ
దనివి సెందక యిన్నివిధాల మలచె
నెంతటి కుశాగ్ర బుద్ధియో యితఁడనుచు
భావమున మెచ్చె రుద్రమ దేవి యపుడు

తన మనస్సు వికారపడినందుకు కాదు. పడినట్లు రుద్రమదేవికి తన ప్రవర్తన అనుమానము కలిగించినది కదా అన్న నిర్వేదముతో శిల్పి ఈ దేశమును వదలిపోయినాడు. ఆ విషయ మీ శిల్ప సందర్శనము వేళనే రుద్రమదేవికి తెలిసినది. ఆయన ఒకలేఖ వ్రాసిపెట్టి పోయినాడు. రుద్రమదేవి శిల్పి నిర్వేదమును కాత్యాయని తెచ్చియిచ్చిన లేఖలో చదువుకొన్నది.

ఒక సౌందర్యము రూపు గట్టుకొనె నా యూహన్ ప్రవేశించి న
ర్తక పోలెన్ రతిపోలె నాగిని వలెన్ ప్రాలేయ భూభృత్కుమా
రిక పోలెన్ గజలక్ష్మిపోలె సకల స్త్రీమూర్తి సంస్పృష్టమై
ప్రకృతంబై హృదయైక వేద్యమయి నిర్మాణ్మకయన్ వెల్వడెన్

మనము నిమిత్త మాత్రులము మానిని! సర్వము నీశ్వరేచ్ఛగా
ననువుపడున్ జనావళి, కహంకృతి జ్ఞాన విహీనుఁడంతయున్
దన ఘనకార్యమంచు మది దైవము నెంచడు యోగకాలమం
దనునయ మొందు దైవవిధి యంచుఁ దదర్థములెల్ల బొల్లువో

కళల కాణాచి యగు నొక్క కలువకంటి
చికిలి చూపుల మధు మరీచికలు చూచి
భ్రాంతిపడి యిన్నినాళ్ళు సర్వమ్ము మఱచి
యుంటి సదసద్వివేక శూన్యుండ నగుచు

ఉపాస్య దైవమును మంత్రమూర్తిని మానవాకారమున చూచి తట్టుకొనలేక భ్రాంతికి లోనై మనోజ దేవమయిని మనస్సుచేతనే పొందవలయునని తీవ్ర తపస్సు నభిలషించి పోయినట్లు శిల్పి దేశాంతర గతుడైనాడు. ఒక్కొక్క సారి యోగము భ్రష్టమగుటకు దైవముకూడ కారణము కావచ్చు నన్నమాట. విశేషమేమనగా శిల్పికి అంతయు భ్రాంతికాదు. కొంత జ్ఞానమున్నది. తన ఉపాస్యదైవము యొక్క సౌందర్యస్వరూప జ్ఞానమున్నది. తాను యోగభ్రష్టుడగుట దైవ విధి యన్న జ్ఞానమున్నది. అమ్మవారి వాత్సల్యమునందు పూర్తి విశ్వాసమున్నది. తన చేతిలో నున్న శిల్ప కళ ద్వారానే మహాలక్ష్మిని ఉపాసించి సదసద్వివేకమును పొందవలయునన్న ప్రగాఢమైన వాంఛయు ఉన్నది. శిల్పి యొక్క యీ ఆంతర్యమును చుట్టుకొని రకరకములయిన గజిబిజి ఊహాలున్నవి. అతడు మనిషికదా! అందుకని. ఇంతటి దృఢ సంకల్పముతో నున్నవాని జీవితమునకు ట్రాజెడీ యెట్లు పట్టును? భక్తుని జీవితమునకు ట్రాజెడీ యేమిటి? కామేడీ యేమిటి?

## III

ఈ కావ్యమును ఇట్లు విమర్శించి చూచుకొనవలయునని ఎక్కడ యున్నది? ఎక్కడను లేదు. ప్రకాశమునందు విమర్శశక్తి యున్నట్లుగా కావ్యమునందే దాని విమర్శన విధాన సూచనముకూడ అంతర్లీనమై యుండును. కనుక కావ్యమును లోనారసి చూడవలయును. ఇంతవరకు కథాతాత్పర్యమును కవి యెట్లు తీర్చిదిద్దుచు వచ్చినాడో గమనింపబడినది. ఇక కావ్యము చివరి భాగమున్నది. దాని పేరు అనుతాపము.

శరన్నవరాత్రులు వచ్చి శ్రీ దేవీపూజలు జరుగుచున్నవి. ఓరుగంటి కోట దేవీపూజా మహోత్సవానందమున ఓలలాడుచున్నది. ఈ నేపథ్యమును సంతరించి కవి రుద్రమదేవిని ప్రవేశపెట్టుచున్నాడు.

రాణి రుద్రమ ప్రాసాద రాజమందుఁ
జంద్రికలఁ దేలు చల్లని సమయమందుఁ
దలపునకు వచ్చె శిల్పి ప్రధాన రచిత
పత్త్రి నిర్వేద నిష్ఠుర భావ మహతి.

ఎంతగా నన్ను గూర్చి భావించి నాడొ ?
ఎంత వలవంత నిట్టూర్చి ఏగినాఁడొ ?

అతడఁ లౌకిక దరహాసి తాననుండు
కనఁ బడిన మేను పులకించుఁ గదలు నెడద.

ఆ రమణీయ మూర్తి హృదయంబు వికావికలై విరక్తితో
నేరికిఁ జెప్పకుండఁ జనియెన్ గదా ! శూన్య జగత్తులోని కో
తారకలార ! మీరతని దారి వెలుంగులు గ్రుమ్మరించి న
న్నారయు నట్లు సేయుఁ డెప్పుడైనను; మీకు శుభమ్ముగల్గెడిన్

శిల్పియొక్క అలౌకికానందానుభవ లక్షణమును రుద్రమ భావించుచున్నది. ఆమెకు తెలిసికాని తెలియకుండకాని ఆమెయందు దేవి కూర్చొనియున్నదని కవి చెప్పుచున్నాడు. శిల్పిని మిథ్యాజగత్తులో పోనీయక కాపాడవలయునని దేవి సంకల్పించుచున్నది. కాపాడుట యనగా అతడు వచ్చి తనను తెలిసికొనునట్లుగా చేయుట. తానే వానివద్దకు పోరాదా? దేవతకు అనుగ్రహించుటయే లక్షణము. జీవుడే ఈదుకొనుచు ఆమెను పొందవలయును. ఆతనికి తన వైపుగా వెలుగులు చూపింపవలసినదిగా తారకలను కోరుచున్నది. కవి ఈ భావము నెందుకు వ్రాసినాడు? రుద్రమయందు దేవి కూర్చున్నదని సూచించుటకు. తారాకాంతి తిరస్కారి నాసాభరణ భాసురా ! తన నాసాభరణ కాంతి విశేషముచేత తారాకాంతిని వమ్ముచేసిన మహాదేవి తన ఆధిక్యము నట్లుంచి భక్తరక్షణ కళాహేతువైన వాత్సల్యముచేత వానికి సహాయపడవలసినదిగా తారకలను కోరుచున్నది. అమ్మవారెవరి చేతనైనను ఏపనినైనను చేయించగలదు. ఆమె ప్రార్థించుటకును ఆజ్ఞాపించుటకును భేదములేదు. ఆవిధముగా రుద్రమదేవియందు పరమేశ్వరిని కవి చూపించుచున్నాడు. వికారము చెందినట్లు పసికట్టిన శిల్పి హృదయమును స్మరించిన రుద్రమచేత ''బుద్బుద సమముల్ శరీర సుఖముల్ తమకింతురె వానికై యిటుల్'' అని కవి అనిపించినాడనగా ఆమె యందా దేవతా వాత్సల్యమును ప్రదర్శించుచున్నాడన్నమాట. మరియు "నీదానను, యేమి చేయగలదానను దుర్విధి యడ్డువచ్చినన్'' అనుచున్నది. విధి నియతి దాటరానిదవి హెచ్చరించుచున్నది. ''నన్ను చూచి వ్యామోహము తోడనీ భువనమోహన శిల్పము

లన్ వేలార్చి"నా వనుచున్నది. దేనిని చూచి మోహమును పొందినవాడు యోగ భ్రష్టుడు. అయినను ఆమె అనుగ్రహమువల్ల ఆ శిల్పకళా సంపద నిలబడ్డది. ఇంతటితో కావ్యము సమాప్తమైనది.

ఈ కావ్యము నిట్లు విమర్శించు కొనవలయునని కవి ఉద్దేశించి యుండనిచో ఆ శరన్నవ రాత్రుల దేవీపూజా ప్రసక్తి యెందుకు? ఈ రుద్రమ దేవియొక్క అనుతాపమునకు కవి సంతరించిన నేపథ్య విశేషమును బట్టియే ఈ కావ్యమును మొదటి నుండియు ఇట్లు విమర్శించుకొనుచు వచ్చుట. ఇది పద్ధతి కానిచో ఈ కావ్యము ట్రాజెడీ కాక తప్పదు. అగుచో కావ్యము నప్పుడు తిరుగ వ్రాయవలసి యుండును. ప్రణయము భగ్నమగుటకు కావలసిన తీవ్ర సంఘర్షణాత్మకమైన బాహ్యాభ్యంతరముల నడుమ పాత్రలను నడిపించుచు వ్రాయవలసి యుండును. కవి వ్రాసినది వ్రాసినంత వరకు పద్ధతిగా ఉండి అర్థవంతముగా నున్నప్పుడు కాని వాని కొరకు వెతకుటవలన నేమి ప్రయోజనము ?

శ్రీ శోభిరాల సత్యనారాయణగారు రెండు ప్రయోజనముల నుద్దేశించి ఈ కావ్యమును వ్రాసినారు. ఒకటి–శృంగారమును శాంతమునకు పరిణమింపజేయుట. రెండు–రామప్ప గుడి శిల్ప కళా ఖండములను వర్ణించుట. వర్ణనముల విషయమున కవి నిశిత పరిశీలన దృష్టి కావ్యము నందంతటనుకలదు. రస పరిణామ నిరూపణాత్మకముగా కావ్య వస్తువును నిర్వహించుటలో కూడ కవి చాలవరకు కృతార్థుడైనాడనియే చెప్పవలయును. ఇందు కవియొక్క పని తనమంతయును రస పరిణామము నుద్దేశించిన రచన చేయుటలో నున్నది. సహృదయులు దానిని గమనించి కావ్యము నన్వయము చేసికొనుట కనువుగా కొంత సూచన చేయబడినది.

ఇంత శిల్ప సుందరమైన కావ్యమును రచించిన శ్రీ శోభిరాల సత్యనారాయణ గారికిది యెంతయు. అభినందనము. ఇతి శివమ్.

సంక్రాంతి భోగి 13-1-1974

కేతవరపు రామ కోటి శాస్త్రి
రీడరు, ఆంధ్ర భాషాశాఖ; పి. జి. సెంటరు; వరంగల్.

# అభిజ్ఞుల అభిప్రాయములు

డా. డి. వేంకటావధాని, ఎం.ఏ (ఆనర్స్), పి.హెచ్.డి.

హైదరాబాద్

శ్రీయుతులైన శోభిరాల సత్యనారాయణగారు దయాదరములతోఁ బంపిన "రాగమయి" అనుకావ్యము నాద్యంతము పఠించి యానందించితిని. ఇందు నందీశ్వరుడు, కాముని పున్నమ, నిరీక్షణ. శిల్పదర్శనము, నిర్వేదము, అనుతాపము అను నారు భాగములున్నవి. తెలంగాణమునందలి రామప్పగుడి శిల్పకళాలక్ష్మికి నిలయమైనట్టిది జాయపసేనాని నృత్తరత్నాకరము నందలి లక్షణముల కదియొక విధముగా లక్ష్యమని చెప్పుదురు. అందలి శిల్పసృష్టి కావించిన శిల్పిబ్రహ్మ యెవ్వరో తెలియదు. అతని శిల్ప కళాకౌశలము మాత్రమనన్యాదృశమైనట్టిది. అది రాణి రుద్రాంబ మనము నావర్జించినది. శిల్పదిదృక్షచే నరుదెంచిన యా యువరాజ్ఞి సౌందర్య సంపద సరస హృదయుఁడైన శిల్పిశేఖరుని మానసము నాకర్షించినది. కాని యేమి లాభము? సాంఘికమైన యంతరమును, ఇతర పరిస్థితులను ఆ ప్రణయమును భావములందే జీర్ణమగునట్లొనరించినది. నిరీక్షణ, నిర్వేదము, అనుతాపము అను భాగము లా సరస హృదయుల భావములను చక్కఁగా వెల్లడిచేయుచున్నవి. "ప్రేమము వ్యథాకులంబైన మృతియె మేలు - ప్రణయ గంధములేని జవ్వని సొబంగు సుక్కిపోవదె నిర్గంధ సుమమువోలె" అనుభావములు రుద్రాంబ నైరాశ్యమును వ్యక్త మొనరించుచున్నవి.

శిల్పి శిల్పకళాకౌశలముతో వర్ణించుటలోఁగవిగారు చూపిన నేర్పు ప్రశంసనీయముగానున్నది. నిర్వేదము, అనుతాపము అను భాగములందలి భావములు ప్రేమమయములై బహుమనోజ్ఞములుగానున్నవి. ఇందలి పద్యములు ధారాశుద్ధిశోభితములై చదివిన కొలంది చదువవలెనను నుత్కంఠ రేకెత్తించు చున్నవి. వీరి కొన్నిపద్యములందలి భావములు కవికుల గురువైన కాళిదాసుని "రమ్యాణి వీక్ష్యమధురాంశ్చ నిశమ్యశబ్దాన్"వంటి శ్లోకములను, "ద్వాసుపర్ణా సయుజా సఖా యౌ" వంటి ఉపనిషద్వాక్యములను స్మరణకుఁదెచ్చుచున్నవి. సలక్షణ పద్యరచన అపురూపమైపోయిన

యీ రోజులలోనింత ప్రౌఢ సుందరము, నిర్దుష్టమునైన రచన కావించిన శ్రీ సత్యనారాయణగారి నభినందించుచు వారి ప్రతిభ యింకను మధురోదాత్తములైన కృతులను పండింపవలెనని ఆకాంక్షించుచున్నాను.

29-5-74 దివాకర్ల వేంకటావధాని

II

ప్రొ. కె. సుబ్బరామప్ప, యం; ఏ. బి. యిడి; బి. ఒ. యల్.

ఆంధ్రభాషా శాఖాధ్యక్షులు (రిటైర్డ్) మైసూరు యూనివర్శిటీ,

మైసూరు.

శ్రీ శోభిరాల సత్యనారాయణ గారి 'రాగమయి' కావ్యాన్ని చదివాను.

కాకతీయకాలపు శిల్పసంపదను శిల్పి యొక్క మనోభావాలను, ఆ శిల్పాలను చూచిన రుద్రమదేవి యొక్క ప్రేమానురాగాలు కన్నులకు కట్టినట్టు చిత్రించారు.

మనోగత అభిప్రాయాలను వర్ణించిన తీరు, చదువరుల మనస్సును ఆకట్టుకొంటాయి. పాత్రపోషణ సముచితంగా తీర్చిదిద్దినట్లుంది.

3-6-74 కె. సుబ్బరామప్ప

# స్వవిషయం

స్థిరమతి రామచంద్రుఁడను ధీనిధి యొక్కఁడు వ్రాసెనున్న,
"కిన్నెరఁ" జరితాంశ మొక్కకథ నిగ్గులు దేలిచి వ్యాసమొండు,
మద్విరచిత కావ్య హేతు; వితివృత్తముఁగొంటి నాకింతమార్చి,
తత్సరసునకేఁ గృతజ్ఞుఁడ, సదా పరదేవత వానిఁ బ్రోచుతన్.

అప్పుడ తత్కథావిషయమారయఁ, "బాలముపేట" పోయి, రా
మప్ప కళా విశేషముల కచ్చెరు వంది, ప్రమోద వారిధిన్
దెప్పలఁ దేలి, కావ్యముగఁ దీర్పఁ దలంచితిఁ గాని వీలుగా
కిప్పటి కీశ్వరేచ్ఛ రచియించితి "రాగమయిన్" రసాత్మికన్

ఈకథలో యథార్థమదియెంత? తదీయకపోలకల్పనా
లోకమదెంత? యంచు మదిలోఁ దలపోయు విమర్శకాగ్రణుల్
లోకములోని ప్రేమరసలోలురఁ జూచితిరేని, వింతలా
పోకడలెల్లఁ దెల్లమగు పోవుమనమ్మున సందియమ్ములున్

పలనాటి సీమలోఁ దెలుఁగు పండితునిగా
కొలువుచేసితి నొక కొన్నినాళ్ళు
ఆంగ్లభాషా బోధనాధ్యాపకుండనై
కొలువుచేసితి నొక కొన్నినాళ్ళు
సాంఘిక విద్యాప్రచారకోద్యోగినై
కొలువుచేసితి నొక కొన్నినాళ్ళు
సాంఘిక సంక్షేమశాఖ నుద్యోగినై
కొలువుచేసితి నొక కొన్నినాళ్ళు

# XXVII

మఱి సమాచార పౌరసంబంధశాఖ
కొలువుచేసినవాఁడను గొన్నినాళ్ళు
తిరిగి తిరిగి కళాశాల తెలుగుశాఖ
జేరితి తెలుంగుబాసకు సేవఁజేయ.

పదవీ బాధ్యతలన్ మునింగి కవితావ్యాసంగమున్ మాని నేఁ
బదునై దేండ్లుగఁ జేయజాలనికృతిన్ ప్రాజ్ఞుల్ ప్రశంసింప, నిం
పొదవన్ నేటికి వ్రాయగల్గితి నిటుల్, యోచించి చూడన్ దురా
సదమౌ నట్టి ప్రయత్నమైన భగవత్సాహాయ్యమే లేనిచో

సమరసభావపూర్ణులయి సమ్మతిఁ దీరికవేళలందుఁ గా
వ్యమును బఠింపఁగా విని శుభంబని సూచనలిచ్చినట్టి కూ
రిమి చెలులున్ గవుల్ బుధవరేణ్యులు శ్రీ పరమేశ్వరీ కటా
క్షమున సుఖంబుగాంచెదరుగాక! తదన్యులమాట లేటికిన్

కళల కిరవగు నట్టి శ్రీ కాకుళమున
భువన విజయమ్ములోఁ గృష్ణభూపతియయి
రామభద్రుఁడనగు నన్ సభాముఖమున
గౌరవించిన నాటి సఖ్యంబునెంచి,

శ్రేయముఁగోరి కావ్య మనుశీలనఁజేసిన, భారతీ కుచ
శ్రీయుతుఁ డద్వితీయ గుణశీలి, రసజ్ఞుఁడునైన కె. పి. నా
రాయణరావు, న్యాయపతి ప్రాభవమున్ గని లోకమాత నా
రాయణి సత్కృపన్ శుభపరంపర కల్గి సుఖించుగావుతన్

ఏ భగవత్యుపాసన ఫలించుట నీకు విశేషశేముషీ
వైభవమబ్బె; నాకుఁ దదుపాస్తి లభించె మదీయకావ్యపున్
శోభను బెంచుపీఠిక, యశోనిధి వేంకటరామకోటి శా
స్త్రీ! భవదీయ తత్త్వపరిశీలన కాంతరదృష్టికిన్ నతుల్

శ్రద్ధ తోడ మిగుల శ్రమకోర్చి మత్కృతి
నచ్చు వేయఁబూని నట్టి సుకృతి
యను దినాభివృద్ధి నానంద వర్ధనుఁ
డిందిరా కటాక్షమందుఁగాక !

సదభిప్రాయము లొసగిన
సదమల చిత్తులకుఁ గావ్యశాస్త్రజ్ఞులకున్
బదపడి సమీక్ష సేయు స
హృదయుల కొనరింతు నతులనేకశతమ్ముల్.

టెక్కలి
శ్రీకాకుళముజిల్లా

శోభిరాల సత్యనారాయణ, యం. ఏ;
తెలుగు భాషాశాఖ; ప్రభుత్వ కళాశాల

## కృ త జ్ఞ త లు

కావ్యాన్ని పంపిన వెంటనే చదివి అమూల్యమైన అభిప్రాయములిచ్చిన సుప్రసిద్ధ విద్వద్వరేణ్యులు శ్రీ దివాకర్ల వేంకటావధాని గారికి (ఉస్మానియా యూనివర్శిటీ), శ్రీ కె. సుబ్బరామప్పగారికి (మైసూరు యూనివర్శిటీ) తదితర సహృదయులకు నా కృతజ్ఞతా పూర్వక వందనములు.

—కావ్యకర్త.

# నందీశ్వరుడు

ధరణిపయిఁ గూర్మి నిజపయోధరధారఁ
విస్రుతామృతధారలు వెల్లివిరిసి
జీవనాధారముగ ఫలసిద్ధిఁ గూర్చు
ప్రబలశక్తిస్వరూపిణి ప్రకృతిమాత 1

అదె రమ్యంబగు రామసాగరము !
సంధ్యారాగ సౌందర్యసంపద వీక్షించుచు
విశ్వకర్మ చరమత్మభృత్కలారాధ్యుఁడై కదియన్
దత్స్ఫురితచ్ఛటల్ జలతరంగస్ఫూర్తి శిల్పాకృతుల్
గదలించున్ హృదయమ్ము
నాత్మగత సంస్కారమ్ము లఱ్ఱాడఁగా 2

తత్సరోవర నికట కాంతారసీమ
నభవు నానతి నా రజతాద్రి నుండి
భువికి దిగివచ్చినట్టు లపూర్వశోభ
నేలుబడి సేయుచుండె నందీశ్వరుండు. 3

ఏమి శిల్పము! దీని కెంత తేజమ్ము!!
ఎంత చక్కందన మేమి చెక్కడము!! 4

మువ్వలు గంటలు ముత్యాలసరులు
మామిడిపిందెల మలకపట్టెడలు
మొగమునదీపింప, ముకుఁద్రాటి సొంపుఁ
గుడివైపు ద్రిప్పిన మెడలోని గంట,
కులుకుగుబ్బలవంటి కుఱుచకొమ్ములకు
మూపురమ్మునకెడ ముడివైవఁ బడిన
కుచ్చులు వ్రేలాడ, గోటు నాజూకు
నాగబంధముతోడ నలువొప్పు స్వామి. 5

ముంగలి కుడికాలుముడిచి, డాకాలు
వంచి భూస్థలినుంచి, వామపాదంబు
పృష్ఠభాగంబునఁ బెడగాలు వైచి
కుడికాలి గిట్టలు పుడమిపై మోపి
గంభీరముద్రలోఁ గనిపించుచుండుఁ
దనముందు నిలబడి తనివోవు జనము
లెటునుండి చూచిన నటు కృపాదృష్టిఁ
బ్రసరించుచుండు నా బసవేశ్వరుండు. 6

కెలసి గురుండు మాయఁ దొలగించి
యనశ్వరమైన యాత్మలో
వెలుఁగును జూపు చందమున
విశ్వహితప్రతిపాదియై
పరస్థలములు చెక్కి నైపుణి
దృషన్మణులన్ సగుణాత్మ తేజమున్
వెలువడఁజేయు శిల్పి
పరవిచ్చతురుండు గదా నిజమ్ముగన్ 7

ఆ విగ్రహం బెంత యందాల గనియొ!
ఆబాలగోపాల మచటనే యుండె!!
ఎవ్వరేనియు దాని నీక్షించి యచోటు
దొలగిపోవరు జనుల్ తొక్కిళ్లువడిన! 8

ఏమి యాకర్షణం బెసలారు నిందు!
రాచబిడ్డలు కాని, రాణులే కాని,
చూడవచ్చిన, దానిఁ జూచి కేల్మోడ్చి,
తత్సృష్టికర్త మేధాశక్తి నెంచి,
రాల గర్భాలలోఁ బ్రాణాలు వోయు
మహనీయ శిల్పి సమ్రాట్టును గూడ
దర్శింత మీజన్మ ధన్యమా ననుచుఁ
బోదురాతనిఁ జూడఁ బూజ్యభావమున. 9

ఎక్కడెక్కడివారు నిన్నెంతో ప్రేమఁ
జూడవచ్చినఁ గన్నెత్తి చూడవేమి?
ఓ మహాశిల్పి! నీ యసితోపలములు,
నీ కళాసృష్టి నీ పని నీదె గాని!? 10

ఓ యచంచలదీక్షాపరా। యమూల్య
రత్నచయములు నీముందు రాలుచున్నఁ
దొణక వదియేమి? యతులకౌతూహలమున
వచ్చి నిన్నుజూచిపో నొక్క వామనయన. 11

ఆమె నిలువెల్ల నాభిరూప్యంబ తోచు
నామె చూపుల నాభిజాత్యంబు దొలకు,
లలిత శృంగార హేలా విలాసగతులఁ
గానిపించెడి శుద్ధాంతకాంత వోలె. 12

చూచినఁ జాలు నీ భువనసుందరిరూపము నొక్కమారు,
నీ వా చెలువమ్ముదిద్దుపని నాపి కనుంగొను
మామె నీయెదన్ దోచునో?
యాత్మభావపరితోషణ మీ రమణీయ శిల్ప
కావ్యోచిత దివ్యవస్తువయి -
యూయెల లూచునో యేమొ నీమదిన్ 13

రమణి మణికంకణక్వణనముల పెంపు
స్థపతిపతి శిల్పకార్యతత్పరతఁ బాపఁ
గాంత కాంత తనూరుచిఁ గనులు చెదరఁ
గౌతుకముతోడ శిరమెత్తి కాంచె నెదుర. 14

ప్రణయిజన హృదయభేదన చణ
చంచల మధుర దృక్ప్రసారిణిఁ
దరుణారుణరాగాంశుకధారిణిఁ
బ్రణిహిత సౌందర్య రసతరంగిణిఁ దరుణిన్ 15

తన యుపాస్య దేవతయె కళాలక్ష్మియై
వాంఛఁదీర్ప నెంచి వచ్చినట్లు
తలఁచె శిల్పి, హర్ష కలిత చేతశ్ముఖి
కనులువిప్పి క్రమగతుల నాడ. 16

ఆ చతురానన ప్రతిభు నాననమున్ గనినన్,
ప్రసన్నతా సూచక మందహాస
పరిశుభ్రలసన్మృదు కాంతిరేఖలే తోఁచెనో ?
వానితోడ సరితూగను, సుందరి లోచనమ్ములా
సేచనకమ్ములై చెలిమిచేసెనో
తన్నయనాల నంతలో. 17

ఆ కళాతపస్వి యా జగన్మోహినిఁ
గాంచినంత రూపకల్పనమున
నెదియొ క్రొత్తయంద మొదసందడింపంగఁ
జెక్కఁదొడఁగెఁ బ్రతిమఁ జికిలిచేసి. 18

భసిత రుద్రాక్షమాలికాభద్రుఁడైన
స్థపతిరాణ్మణి వదన తేజంబు చూచి
నిర్వికారతయును గళానిరతిఁ జూచి
నిర్వృతింజెంది రాపడి నిలిచె నెలఁత. 19

అపరసృష్టికర్తయైన శిల్పీశ్వరు
హస్తకౌశలమ్మె యరయుచుంటొ !
ప్రస్తరాంతరమునఁ బ్రతికృతిం గనుచుంటొ !
సమ్మదంబుతోడఁ జారునేత్ర ! 20

మదిరాక్షీ! కనులింత చేసికొని
　　ప్రేమన్ గాంచుచున్ బోవు నీ
పదవిన్యాసము "రూపురేక"లును
　　లావణ్యంబు హేలాగతుల్
ముదమున్ గూర్చెడి,
　　రాజశిల్పి కనినన్ బోనిచ్చునే యట్టు లిం
పుదలిర్పన్ నిను శిల్పరాజ్యమున నిల్పున్
　　రాణిగా జాణగా. 21

రతి వచ్చి ప్రక్క నిలిచిన
నుతిసెడి నిజపత్ని నెఱుగ మదనుండై నన్
సతమత మగునట్లు
రతిప్రతిమను నిర్మించె స్థపతి ప్రతిభామతియై 22

జీవకళ లుట్టిపడ రతిదేవి మూర్తి
దిద్దితీరిచి ప్రాణప్రతిష్ఠ జేసి
తిరిగిచూచిన లేదట దివ్యకాంత
యమరశిల్పములో లీన మాయె నేమొ! 23

"ఆ చపలాయతాక్షి వదనాంబుజ మింతకుమున్న
　　యెన్నడో చూచినయట్లు తోచు,
　　నెటజూచితినో మఱి జ్ఞప్తి లేదుగానీ,
చిరకాలమైత్రి మది నిల్చిన రూపము నేడు నాకు
దృగ్గోచరమై నవద్యుతులుగూర్చె"
　　నటంచు దలంచె శిల్పియున్. 24

# కాముని పున్నమ

చివురు దొడిగిన మామిడిచెట్టు పైనఁ
గుహు కుహూయని కోయిల కూయఁదొడఁగెఁ;
బసరుపూబిందియల నొత్తి మెసవలేక
రాజకీరము రుచి చూచి రాల్చుచుండె. 1

మామిడితోరణాల నిజమందిరముల్ గయిసేసి, కామినుల్
కోమలపాణిపద్మములఁ గూరిమితోడఁ బరస్పరంబు బు
క్కాములు చల్లుకొంచు నయగారములన్ బ్రియమారఁ
జూచినన్
గాముని పండు వెల్లరకుఁ గన్నులపండువు సేసె నత్తఱిన్. 2

హోలీపండుగ తరుణుల
పాలిటి కల్పకము, పల్లవప్రకరములన్
లీలావినోదకేళీ
హేలల నలరున్ రసప్రహేళిక వోలెన్ 3

ప్రతివనిత పెండ్లికోమరిత
ప్రతిపురుషుఁడు పెండ్లికొడుకు వలె ముస్తాబై
చతురవచోవిలసనముల
రతిరాజును గొల్చి ప్రణయరాజ్యము లేలన్ 4

అంగజ వేష ధారులయి యంగనలన్ గని స్నేహపూర్ణులై
సంగడికాండ్రు వేడుక వసంతము చిమ్మనగ్రోవు లెత్తి చ
ల్లం గరకంకణధ్వనుల లజ్జలు వీడి లతాంగు లేచఁగా
నింగిని దాకెఁ బుప్పొడులు నెయ్యపుగుండెల మంటలో యనన్

రంగురంగుల జిలుఁగుచీరలు ధరించి
"మనసులోఁ గోరికలు దీర, మదన! నీకు
మా శరీరాంగకములు భర్మంబు తోడ
నిత్తు" మని మ్రొక్కుకొనుచుందు రిగురుఁబోండ్లు. 6

కామవివర్ధకంబయిన కామునిపున్నమ నాఁడు, నిర్మల
ప్రేమనిదానమౌచు విహరించెహో రంగులరాచబిడ్డ, తాఁ
బామరభామ వోలెఁ బలుబాటలఁ బల్లెలఁ బట్టణమ్ములన్
నేమము లన్నియున్ విడిచి నెచ్చెలు లచ్చెరువంది చూడఁగా.

ఆ విధముగఁ జని రామ స
రోవర రమణీయ మృదులరోధస్స్థలిపై
పావన చలదుత్కలికా
సేవనమున సేదదేఱి చెలులున్ దానున్. 8

మాటాడుచు మాటాడుచుఁ
బాటలగంధులను విడిచి భామామణియున్
గాటంపుఁగోర్కు లెదలో
దీటుకొనన్ శిల్పవాటి దిక్కునఁ బోయెన్. 9

★ ★ ★

దైవసృష్టిలోని ధర్మంబు మర్మంబు
దలచికొనుచు, శంభునిలయ మందు
వివిధరూపములను విన్యాసమొనరింపఁ
జింత సేయుచుండు శిల్పి యొకఁడు. 10

సంధ్యవేళలందుఁ జరణనూపుర మృదు
నిస్వనములు కంకణస్వనములు
కలఁతవెట్టు నతనిఁ; గనరాదు దూరాన
నడచినట్లుతోఁచుఁ బడతి యెవరో! 11

బహువిధపుష్పపరిమళ
సహితమొ? సారంగసంఘచలనోజ్ఝితమో
బహుళముగ వ్యాప్తిఁ జెందుచు
సహృదయ సంభావ్యమగుచు సౌరభమొలయున్ 12

వింత వింత నెత్తావుల విరులు బాల్చి
యీ ప్రశాంతకాంతారమం దెవతెయేని
దివ్య చందన దిగ్ధాంగి తిరుగునో కొ-
వెలిఁగుదోఁపఁగ దివసాంత వేళలందు ? 13

ఆ జవ్వని యందెల సడి
గాజుల గలగలలు దేహకాంతుల పొలుపున్
జాజర సేయున్ దన్న
వ్యాజ ప్రేమోదయమ్ము వ్యాకులపఱచున్ 14

కొందఱిని జూడ స్నేహంబు గోరు మనము
కొందఱిని జూడఁ దొలగిపోఁ గోరుచుందు;
రాగము విరాగమును జీవరాశులందుఁ
గలుగుటకుఁ గానరా దెట్టికారణమ్ము ! 15

సురుచిరమ్మగు రూపమ్ము చూచినపుడు
మృదుమధురమైన గీత మాలించినపుడు
హృదయము ద్రవించి స్పందించు నెవనికైన
సహజమగు పూర్వజన్మవాసనల వలన. 16

కనిపించియుఁ గనిపించక
తన మనమును గలఁతపెట్టు తరుణీమణియే
యొనలేని నెనరుఁజూపుచుఁ
దన తపము ఫలించి నాడు దర్శన మిచ్చెన్ 17

సకలకళావిదుఁడగు శి
ల్పికుమారుఁడు, తాను జెక్కు విగ్రహములు వే
డుక తోడఁ జూడ వచ్చిన
వికచాంబుజపత్రనేత్ర వెనుకొని పలికెన్. 18

"నాడు రతిమూర్తిఁ జెక్కుచున్నపుడు వచ్చి
క్షణములో మాయమైతివి, చంచలాక్షి !
చూడు మీ శిల్ప మిపుడేనిఁ, జూచినంతఁ
గాంత ! నీ చిత్త మేమైనఁ గరఁగు నేమొ ! ? 19

సుదతి ! సుహృజ్జనాభిరతిఁ జూడు మిటుల్
భవదీయ రూప సం
పద కెనయైనవారలును, మాన్య చరిత్రులు
శిల్ప సుందరుల్
హృదయము లేనివారు,
కికురింపరు నీవలె రాతిగుండెలన్
గదలక నా కనుంగవకుఁ
గన్పడుచుందురు దివ్యభామలై." 20

సెలయేటి పైన వెన్నెల వెలుఁగుల వలె,
వలపుఁ దెలుప విరిసిన విరజాజుల వలె,
లలితాంగి, లలిత లలితమ్ముగ నవ్వె
నా కళానిధిఁ గనుచున్. 21

విమలచరిత, క్రీడాశూన్య, పృథునితంబ
మంగళాకార, హ్రీంకారమధ్యరూప,
అతులితానందదాయిని, యాదిశక్తి
యేకవీరామహాదేవి యెలమిఁ గూర్చె. 22

వేడ్కమెయి నగ్నసుందరి విగ్రహమ్ము
చూచినంతన సిగ్గుముంచుకొనివచ్చెఁ
దలిరుఁబోడికి జలగృహదర్పణమునఁ
దనప్రతిచ్ఛాయఁ గన్న చందంబు గాఁగ. 23

ముసిముసినవ్వులు నవ్వుచుఁ
గుసుమాయుధు ధనువువోలెఁ గోమలి చనుచోఁ
గుసుమాంగరాగ సౌరభ
మసదృశముగ శిల్పి చిత్త మలరింప ననెన్. 24

"హృదయములు రసార్ణవములై ప్రేమరసము
పొంగిపొరలఁగ మనములుప్పొంగిపోవు
సమయమునఁ జేరరాక సంశయముతోడఁ
బాఱిపోఁజూతువేల నో పద్మగంధి? 25

"మలయజ శీతలానిలుఁడు
మాపటివేళ సరస్తటిన్ గుతూహలముగ
సంచరించు సమయాన,
నహర్పతి పశ్చిమాంగనన్ గలిసికొనంగఁబోవు తఱి,
గాజులు గల్లలలాడ,
నెవ్వరో పిలిచినయట్లు వచ్చి కనిపింతువు,
నన్ బులిపింతు వంతలో. 26

"భ్రమర కాంతానుకంపా కరండ కాంక్ష
సానునయముగ, మంజులగాన ఫణితి
గీతములు పాడి యుప్పొంగి నెన్ని శీధు
రసము నర్పించు నీ మధువ్రతము గనుము. 27

"తనువు పులకింప నరమోడ్పుగన్నుల తోడ
భావభరమున బంగారువన్నె లేడి
చెంత నిలఁబడి నను గటాక్షింపు మనుచుఁ
బ్రార్థనలు సేయు కృష్ణసారమ్ము గంటె! 28

"రాజబల పార్శ్వవర్తిని నైమె జిగీష
చారుదరహాస సుమములు చల్లునట్టి
సహచరిని గాంచి సౌమనస్యంబుతోడ
రాచిలుకఁ జేరు చిలిపి గోర్వంకఁ గంటె 29

"జంట జంటలుగా నభసంగమములు
నీలి మబ్బుల మాటునఁ దేలిపోయి
స్వర్గ సుఖముల నందు స్వేచ్ఛా ప్రవృత్తి
నెన్ని పున్నెములను జేసికొన్న యవియొ!? 30

రమణియు రమ్యవీక్షణ పరంపర నింపులు గుల్కుచున్
సమక్షమునఁ ద్రిభంగిగా నిలిచి
స్వాంతమునం దనురాగ హర్ష సంభ్రమములు,
కోపతాపములు పైకిఁ గనంబడ,
మందహాసమున్ భ్రామముడి సొంపు గూర్చ
నెడమోమయి శిల్పిని గూర్చి యిట్లనున్ 31

"ఎవరిచ్చినారు చనవులు
యువతుల శిల్పముల మలచి, యున్నతభావ
ప్రవణాల గుణగణ్యాల నిటు
వివిధోజ్జ్వల విరల భావ విహ్వృతలఁజేయన్. 32

"అనుపమహస్త కౌశల సమంచిత శిల్పకళాచమత్కృతుల్
గని, జనులెల్ల మెచ్చుకొనగా విని,
కౌతుక మొప్పఁ జూడ వచ్చిన,
నను జూచి మోహమునఁ జిత్తవికారమునంది,
యల్లనల్లనఁ బ్రియవాక్సుధాలహరులన్
గరగించి సుఖంప నెంచితే! 33

"వివిధరూపము లెడఁద భావించుకొనుచు
రమ్యలోకాల విహరించు రసిక చక్ర
వర్తి పరివస్య కలరి, శిల్పములు చూడ
వచ్చునెవ్వతె?
మతిలేని వనిత గాక!" 34

అని మృదుమధురోక్తులఁ దన
మన మించుక తెలియఁ బలికి మలయుచు నుండన్
బెనుపారు చెలిమి స్థపతియుఁ
జనుమానము తోడఁ బల్కె జవ్వని తోడన్ 35

"ఎంత కాలముగనో ప్రతీక్షించుచుండ
నాకుఁ బ్రత్యక్షమైతి వీ నాడు, దేవి!
వదలుదునె నిన్నుఁ గోరిన వరము లిచ్చి
చెలువములు చూపి చరితార్థుఁ జేయువరకు? 36

"ఈ సరస్తీరమునఁ బూవుటీర మందు
ఫుల్ల కుసుమాంగనామోదములు సెలంగి
కామితార్థములొసఁగ నేకాంత సేవఁ
బూలఁ బూజింతు రమ్ము! శంపాలతాంగి!" 37

అని రాగోల్లసితాంతరంగుడయి
శిల్పాచార్యుఁ డుద్వేలభావన,
నక్కాంత కరాంబుజంబుఁ గొని సంప్రార్థించె,
రమ్యప్రసూన నికాయమ్మును జేర రమ్మనుచు;
నానందానుభూతిన్ మనస్విని చిత్తమ్మున
నింద్ర కార్ముకము పొల్చెన్ జిత్ర భావాకృతిన్ 38

ప్రణయశీలియు నభిమాన పాత్రుఁడగుట
ముదితయును మంత్రముగ్ధయై మోహనముగఁ
దన్నికుంజాంతరమునకు దారిఁ దీసె
నక్కజమ్ముగ శిల్పి తన్ననుసరింప. 39

★ ★ ★

పంచభద్రాధిరూఢయై
ప్రణయభావశబలితాహ్లాదచిత్తయై
చనెడు వేళఁ
ద్రోవ పొడవున, రుద్రమదేవి యెడఁద
గుప్తరాగ సౌరభ్యముల్ గుప్పుమనియె. 40

"నీ దరిఁ జేరుదున్ మనసునిల్వక,
తియ్యని నీదు నెయ్యమున్ గాదనలేను-
చేరువయి కాంక్షలు దీరఁగ నిన్నుఁగూడి సమ్మోదముఁజెందలేను
వలపుందలపుల్ దొలగింపలేను - స్వామీ!
దయనీయురాలను,
క్షమింపుము, చూడుము సాదరమ్మునన్. 41

"ఎంత వలదనుకొన్న, నెన్నెన్నొ మధుర
భావసుమములు నా మదిఁబరిమళింపఁ
బరవశమ్మయి, నను నేను మరచిపోవ
నా యెఱుకలేక నిను జేర్చె నా పదములు. 42

"నిను దర్శించి చనం దలంచితిని గానీ,
త్వత్కరస్పర్శతోఁ దనువుపొంగెఁ
బ్రమోదబాష్పముల నేత్రమ్ముల్ సుమాళించె,
నెమ్మన మే కాంతయు నెన్నడే ననుభవింపన్ రాని
దివ్యానుభూతిని బొందెన్
శరదిందుకాంతు లెదలో దీపించె, శిల్పిప్రభూ. 43

"ఇంచుక కోర్కె లోన మొలకెత్తె నినుంగన,
నీవునుం గటాక్షించి కనుల్ కనుల్ గలిపి జీవమువోసినఁ
దీవసాగె,
దర్శించి ధృతిన్ రతిప్రతిమ చెల్వము దిద్దినఁ బల్లవించెఁ
బ్రేమించి మనంబుదెల్పఁ గుసుమించె
నెదన్ వలపుల్ గుబుల్కొనన్. 44

"పరుల గుండెలుచీల్చి నెత్తురులు ద్రావు
జాతిలోఁ బుట్టి పెరిగెడు చాన నేను;
శైలజాయత్త చిత్తసంస్కార దివ్య
కల్పనాలోక సంచారిఁ గనుటయెట్లు? 45

మానవతీమనోజ! కులమార్గమహోదయ!!
శిల్పశాస్త్ర విజ్ఞాన రహస్యవేత్తవు, రసజ్ఞుఁడవున్
శివకామసుందరీ ధ్యానపరాయణుండవును
దైవ సమానుఁడవీవు;
కావునన్
మానసపూజఁ జేసి, నిను మన్ననఁ జేసెద నో కళానిధీ. 46

"రాజకుమారి,
నందు యువరాణిని, నిన్నెటు చేరవత్తునో
యోజన చేయుమోయి!
శుభయోగము లేమి వియోగమాధురిన్
దేజము దక్కె,
యిట్లెపుడుఁ దేజిఁయిన్ బరతెంతునేని, 'రా
మోజును జూచి
మోజుపడె భూపతనూజ' యటంచు నవ్వరే! 47

"జీవితాంతము నీ పాదసేవఁ జేసి
ధన్యతను జెందలేను విధాతృనియతి;
ఆత్మసాక్షిగ హృదయసింహాసనమున
నిలుపుకొని యెల్ల వేళల నిన్నుఁ దలఁతు. 48

"కీలుకీలునఁ దవ్వచ్చమత్కృతులు చూపి
నీవు సృష్టించికొన్న కన్నియల నరసి
తృప్తిపడువేళ నెడఁద నర్తించి నీదు
కనుల నిలిచెద హర్షాశ్రుకణము నగుచు. 49

"మాట నయ్యెద నేను నీ మాటలందుఁ
దలఁపు నయ్యెద నేను నీ తలఁపులందు
మధుర రసమొలుకు జీవిత మధురిమముల
మధురిమము నయి నీకు సమ్మదముఁ గూర్తు. 50

"నమ్మి గలచోటఁ బారిజాతమ్ము నగుచుఁ
దావులను జిమ్మలేను నిత్యమును నేను
భక్తి తాత్పర్యముల నీదు పాదయుగళి
పొంతఁ జేరెద నొక గడ్డిపూవు నగుచు. 51

"స్నేహావశమున నీదు సన్నిధిని జేరి
శిల్పములు చూడఁ గలిగెడిఁ జిత్తశాంతి;
శాంతగంభీరహృదయ ! ప్రసన్నమూర్తి !!
మరువ నీ చెల్మి జన్మజన్మాలకేని". 52

# నిరీక్షణ

గున్నమామిడికొమ్మపైఁ గూరుచుండి
పండు తినుచుండె నొకపక్షి; ప్రకృతిశోభ
నుత్సుకతఁ జూచుచుండె వేఱొక్క ఖగము;
కాంచు నానంద మా విహగద్వయమ్ము. 1

చెలువుగట్టున గరికపూసెజ్జ పయినఁ
బల్లటిల్లుచు, నిర్మలాంభ స్తరంగ
భంగ సంకుల కాసార పద్మ సదృశ
చిత్తుఁడై యుండె నొంటిమై శిల్పివరుఁడు. 2

దివ్యశిల్పములు దిద్దితీర్చెడి వేళఁ
దన చెంత వచ్చి నిల్చిన విధంబు;
ఆశ్చర్యచకితయై యానందభరితయై
తన శిల్పములు మెచ్చుకొనిన విధము;
గుండెలలో గ్రుచ్చుకొనునట్లు సూటిగాఁ
దనవంకఁ జూచిపోయిన విధమ్ము
అధికారదర్పంబు నార్ద్రచిత్తము దోఁపఁ
దనతోడ మాటలాడిన విధంబు

తరచిచూడ హృదంతరాంతరము నందుఁ
దనపయిని ప్రేమ లేదని తలచుటెటులో
తెలియక, విచిత్రవేదనాదీనుఁడగుచు
మథనపడుచుండె రామప్ప మానసమున 3

"చూడనింపగు చక్కనిచుక్కయైన
జగము లేలంగఁ జాలిన జాణయైన
రమణి దరహాస కాంతిపూరమున నన్ను
ముంచి తేలించు వఱకామె పొలు పెఱుంగ. 4

"అపుడు చూచితి నామెలో నణఁగియున్న
ప్రణయమధుకీల లుత్కంఠఁ బ్రజ్వలించి
దగ్ధమొనరించె నా యెద దరికిఁ జేర
నామె మాత్రము సామాన్యరాలు గాదు! 5

"ఆమె పలుకదు గాని, లజ్జారుణాస్య
కలికిచూపులె తెలుపు నా కలికి తలపు;
నామె భ్రూభంగములలోని యంద మితర
కాంతల విలాసాల హాసాలఁ గానరాదు! 6

"పంటపొలమునఁ గల క్షేత్రపాలు కొఱకు
వామ హస్తమ్ముతో హేమవర్ణ పాత్ర
భక్ష్యభోజ్యములను గొనివచ్చుచుండు
నమృతహృదయిని యగు విశాలాక్షి యెవరు? 7

"పన్నగమ్మొండు బుసకొట్టి పైకిలేచి
నన్నుఁ బెనవైచుకొన్న క్షణాన వచ్చి
స్వాస్థ్య మొనగూర్చి పోయిన శబరి యేల
శరము సంధించి వెన్నంటి తిరుగుచుండు? 8

"విల్లెక్కు వెట్టి వచ్చెడి
భిల్లాంగన కాళి వోలె భీతిగొలిపినన్
దెల్లని కన్నులు నగుమొగ
ముల్లాసము గొలుపు నువిద యొయ్యారమ్ముల్. 9

"ఏమి యొనరింపఁ బోయిన,
నీ నితాంతవనపథమ్ముల నెందుఁబోయినను గాని
నీడవలె వీడకుండ వెన్నాడుచుండు
కాంతయెవ్వతె? వనదీపకళిక గాక! 10

"చెట్లమీదుగ వచ్చి చిరుగమ్మతెమ్మెరల్
విరహుల గిలిగింతపెట్టువేళఁ
గలికి రిక్కలతోడఁ దెలిమబ్బు తెరచాటు
గొని చందురుం డాడుకొనెడు వేళఁ
గిలకిలారవములన్ గెరలుచుఁ గవగూడి
పులుగులు గూళ్ళలోఁ బొదలు వేళఁ
బట్టిపట్టని నిద్ర భంగమై కన్నులు
బరువుగా మూతలుపడెడు వేళఁ

గోటి మన్మథ రుచుల వెల్గొందు నీవు
శర్మదములగు వివిధ వేషములు దాల్చి
చక్కగా స్వప్నసీమ సాక్షాత్కరించి
నయనపర్వము గావింతు నలిననేత్ర! 11

తూగుచు నట్టువద్రాక్కెదు
నాగమ్ములతోడ దారుణప్రియనర్తకివై
నాగినివో భోగినివో
రాగిణివో తెలియరాదు రాతిరివేళన్. 12

క్రీగంటి చికిలిచూపుల
మ్రోగింతువువీణ, చంద్రముఖి, గానకళా
పాగల్భ్యమెల్ల జూపుచు
రాగసుధామాధురీ సరస్వతి వగుచున్. 13

కళలీను కన్నుఁదమ్ములఁ
గలుముల దొరసానివోలెఁ గనిపించెదవో
కలహంస గమన! త్వత్పద
ములు కరములు మొగము కమలములఁ బోలుటచే. 14

ఉన్నత పయోధరములపై నుల్లసిల్లు
రక్తచేలాంచలమ్ము జీరాడ, బంధు
రంజితోద్వృత్త కబరీభరమ్ము తోడఁ
జండివలె గానిపింతువో చంద్రవదన 15

ఒకపరి ప్రసన్నచిత్తవై యొప్పుచుందు
వొక్కొకపు డేలకో కోప మూనియుందు
వొకపరి స్మితమ్ము, భ్రూభంగ మొక్కసారి
చపలవో చారుశీలవో చంచలాక్షి! 16

కనిపింతువు కనుమూసినఁ
గనిపింపవు కన్నుఁ దెఱచి కాంచిన యంతన్
గనుకట్టువిద్దెలో నే
ర్పును జూపెదొ ? తరుణి, కామరూపిణి వగుచున్ 17

నిత్యనూతనసౌందర్యనిధులు చూపి,
కనులలో నిల్చి, కన్నీటఁ గరగిపోయి,
స్మృతిపథముఁ జేరి, రిత్త కోరికలు రేపి,
యేల యేడ్పింతువు మిటారి ! యీ బికారి ! 18

రతిఁ గన, శిల్పసుందరుల రాగిలి చూచిన,
మందమంద మారుతములు వీచినన్
మధువు గ్రోలెడు షట్పదిఁ గన్న
రాగరంజితమయి నా మనమ్ము కలుషించి
మనోభవ వహ్ని తప్తమై
కుతకుతలాడి నట్లగును గోమలి !
గుండియుపిండి నట్లగున్ 19

నా పయిం గూర్మి లేదొ ? యున్నను సతంబు
దర్శనంబీయ నొల్లవో దర్పమడప ?
స్నేహసౌజన్యములు పరీక్షింపఁ దలఁచి
తన్వి, నటియింతొ దయలేనిదాని వోలె ? 20

చలువ తొలకరి ముత్యాలజల్లువోలె
వచ్చిపోయెద వానందవర్ధనముగ,
మమతలుండియు లేనటుల్ మసలు నీదు
తత్వమెఱుగంగ నెవ్వరితరము దేవి ? 21

సల్లలిత ప్రసూనచయ సంపదఁ గైశిక మొప్పి
వాసనల్ వెల్లువ గొల్పఁగా
లలితవిస్తరశిల్ప
కళాప్రపంచమం దుల్లము పల్లవించి రసముప్పతిలన్,
గరుణాంతరంగ !
నీ చల్లని చూపు వెన్నెలలు చల్లి
ననుం జరితార్థుఁ జేయుమా ! 22

మధురహాసిని ! యానందమయివి నీవు
జనన మాదిగ దుఃఖభాజనుఁడ నేను;
ఆత్మ నలరించు ప్రేమ రసానుభూతి
యొక్కక్షణమైనఁ జాలునో యుజ్జ్వలాంగి ! 23

ప్రేమమయి, త్వత్కటాక్ష వీక్షావ్యాప్తి
మనసు మంజులమై రసమయము గాఁగ,
మమతలను బెంచుకొన్నాఁడ, మైత్రి నించి,
యీప్సితార్థము లిచ్చి పాలింప రమ్మ. 24

శిల్పసౌభాగ్యనిరతి సంసిద్ధిఁ గోరి
యెదురు తెన్నులు చూతుఁ; గన్పించి నంత
సమయశోభితకుసుమప్రసాధనములఁ
బ్రీణనమొనర్చి నిన్ను మెప్పింపఁ గలనె ? 25

# శిల్పదర్శనము

శ్రావణారంభసమయ పర్జన్యమూర్తి
చాయ నందీశ్వరుండు సాక్షాత్కరించి
భక్తితో నాలయమునఁ జూడవచ్చు వారి
కనుమతి యొసంగునటులుండె నభవు మ్రోల. 1

నందివర్ధనములు నాగలింగంబులు
బంతిపూలు పారిభద్రములును
బిల్వపత్రములును వికచాంబురుహములు
పొలుపుఁగులుకు స్వామి పూజ కొఱకు 2

భావజుని రాణి వోలెన్
* 'భావజతిలకమ్ము' గట్టి పరిమళభరిత
శ్రీవాల్లభ్యముతో శో
భావహముగ వచ్చె రుద్రమాంబిక వేడ్కన్ 3

ఆ యతిలోక సుందరి శివాలయమున్ గనవచ్చినంతఁ
'గాత్యాయని' యన్ గళాకుశల హారతి యిచ్చి నమస్కరింప
నాప్యాయత తోడ నిచ్చె మణిహారము,
కాన్కఁబరిగ్రహించి, యా
తోయజపత్రనేత్ర పరితోషమునన్ దిలకించె రుద్రమన్ 4

తెలియని రహస్యమేదియో తెలిసినట్లు
కనులు మిలమిలలాడ, సగౌరవముగఁ
దెలప చూపించె రుద్రమదేవి కపుడు
శివ సమాహిత రమణీయ శిల్పములను. 5

మెడలో మువ్వలు గంటలున్ మొరయ
గంభీరాకృతిన్ దాల్చి,
మామిడిపూఁబిందెసరాలు,
మూపురముపై మిట్టాడు పట్టంబులున్
పొడవౌ నాథము, నాగబంధరచనంబున్
నాణ్యమౌ కుచ్చులున్
గుడిపై పోరగ వింతచూపుల బెడంగుల్ చూపు
నందిన్ గనన్ 6

* భావజతిలకము = సన్నని నూలు వస్త్రము పేరు.

అతిరమణీయకల్పనము లా నవయౌవనముగ్ధమోహనా
కృతులగు నృత్యసుందరులు,
కేళిచరన్మృదుపాద 'నాసికాప్రతిమలు' *
నాట్యభంగిమల ద్వారముఖమ్ములఁ జూచువారి
కద్భుతముగ స్వాగతంబులిడి,
మోదము గూర్తురు ముద్దుగుమ్మలై. 7

లలితోద్గ్రీవా కరద్వయాప్త ఫణియున్
గ్రైవేయ కాళీవిషమ్ములు,
బాహుద్వయ లంబమాన విలసద్భూషా భుజంగమ్ములున్
బొలుపారన్, భుజగేంద్రునిపై నిలిచి,
వంపుల్ సొంపులన్ బోవు నీ
యలరుం బ్రాయపు నగ్ననాగిని
వ్యాళీకావేశమున్ గాంచితే! 8

తలమానికమ్ము, తొడవులు
వలనుగ ధరియించె రూపవతి, వ్రజకలా
వలయాంచిత చేలాంచల
దళమాలాభోగవిలసితను గను మదిగో. 9

కర్ణ భూషణ కేయూర కంకణములు
తారహారమ్ము లనుప మార్ధోరుకంబు
పాదసరములు కడియముల్ పావకోళ్ళు
దాల్చి నటియించు దేవనర్తకిని గనుము. 10

* నాసికాప్రతిమలు = సాలభంజికలు

ఇక్షుఖండంబు చేఁబూని యిందువదన
మరులు గొలుపుచు నున్నది మదవతులనె!
యింత చక్కని మెలనాగ నెచటఁ గనెనొ?
యీ కళారాధకుఁడు దీని నచ్చోట నిలిపె!! 11

పాప మల్ల గారాబాలపట్టి పదము
పట్టి విడువక పయిపయిఁబఱచు దృష్టిఁ
గంటకమ్మును దొలగించుకతన ముండి;
భ్రాంతిఁ గొలుపుచుఁ గులుకు హ్రీరమ్యఁ గంటె! 12

తమకములు దీర వివిధబంధములఁ బెనఁగు
మిధునములఁ జూచి, ప్రియుఁడెద మెదల,
సిగ్గు పడుచు నిలుచున్న సతి కొంగుఁ బట్టి లాగు
చిలిపితనమును గోతిచేష్టలును గనుము. 13

జైన మత నాశనము గోరు శైవ మట్లు
పదరి యొకలేమఁ గరమునఁ బట్టి యెత్తి
వ్యాళి కందించు గజ విజృంభణము గనినఁ
దలిరుఁబోడుల గుండెలు తల్లడిలవె? 14

మురువుగఁ జేతులెత్తి, కరముద్రలు చూపుచుఁ
గామపూర్ణ విస్ఫురిత విలోకనక్రియలఁ బొంపిరివోవుచు
నాట్యమాడుచున్
బరువపు నిగ్గు సూపు సురభామిని
కుంచితవామపాదయై
తిరముగనిల్చి, హర్ష జలధిన్ దొరలించుఁ గళాభిమానులన్. 15

ఓ తరళాయతాక్షి !
నయనోత్సవమున్ గలిగించు నర్తకీ
వ్రాత మనోజ్ఞ లాస్యవిభవంబు
విలాసము వింతచూపులున్
ప్రీతియుఁ జూచి ప్రాజ్ఞుడి
సెబాసని మెచ్చని వార లుందురే!
చేతము సంచలింప గడెసేపిట
స్రష్టఁ దలంపకుందురే !! 16

ఆ శిరోభూషణమ్ములా కేశపాశ
కర్ణికా మేఖ లాద్యలంకార జాల
మెవతె ధరియింపఁ జూచి రచించినాడొ
యా కళాభిజ్ఞుఁ డీ మనోజ్ఞాకృతులకు ? 17

కాకతీయ రాజన్యుల ఘనతఁ దెలుపు
మత్తమాతంగములు మందమంద గతుల
స్వామికిఁ బ్రదక్షిణముసేయ వచ్చె నవిగొ
తిరుగుచున్నవి వరుసలుదీరి చుట్టు 18

పావన జలాశయము నుండి భక్తిఁ దెచ్చి
భూతపతి పాదపద్మ సంపూజనమున
గంధగజరాజు లర్పించు కాన్క లనఁగ
నష్టదళపద్మ సంతతు లమరు నిందు. 19

గజరాడ్బృందము ప్రక్కనిల్చి, యభిషేకక్రీడలన్ నిత్యమున్
భజియింపన్, బరితుష్టచిత్త యగుచున్ బద్మాసనాసీనయై
త్రిజగన్మోహనమూర్తి రూపుఁగొనెఁ బేర్మిన్ వారి
మధ్యంబునన్
గజలక్ష్మిన్ గని మ్రొక్కుమా! సకలసౌఖ్యమ్ముల్
ప్రసాదించుతన్. 20

హరి భజించెడు తనయుఁ బ్రహ్లాదుఁ గాంచి
నిగ్రహము గోలుపోయి నిందించు నా హి
రణ్యకశిపుని బట్టి గర్భమ్ము చీల్చు
నుగ్రనరసింహుఁ గాంచు మో యుత్పలాక్షి! 21

కత్తియును డాలు తన రెండుకరము లందుఁ
బూని మత్తేభమును దాకు పూవుఁబోడి
ధైర్యసాహసములు మెచ్చఁదగును గాని
యబల లందింత తెంపరు లరుదు గాదె? 22

దివ్య శిల్పాభిరామ మీ దేవళమ్ము!
బాహ్యసౌందర్యమును జూచి పరవశింతు
వాలయాంతర సౌభాగ్య మరసితేని
దేవి! యానందలహరిలోఁ దేలిపోవె? 23

పట్టుదలతోడఁ దలపెట్టి నట్టి సకల
కార్యముల కెందు విఘ్నముల్ గలుగకుండ
విజయముల కల్గునట్లు దీవింపు మనుచు
గణపతికి మ్రొక్కు కొమ్మిటఁ గంబుకంఠి! 24

శివుని హుంకారమునఁ బుట్టి చేవ మిగిలి
దక్షయజ్ఞ విధ్వంసన దక్షుఁడైన
ప్రళయకాల భయంకర రౌద్రమూర్తి
వీరభద్రేశ్వరుని మూర్తి వెఱపుఁగొలుపు. 25

వీరభద్రుని కండగా వెలుఁగు నదిగో
భర్గుసతి కోపమునఁ బుట్టి భద్రకాళి;
క్రుద్ధ యగునేని శిక్షించు రూక్షవీక్షఁ
గృప గలిగెనేని జనుల రక్షించుఁ బ్రీతి. 26

ఇహాపరసుఖదాయిని,
సంగ్రహ ణాభి ధ్యాది సర్వ కలుషఘ్ని, మహా
మహిమాన్వితయగు దేవికి
మహిషాసురమర్దనికి నమస్కృతు లిడుమా! 27

తల నించుక పయికెత్తిన
జలజాయతపత్రనేత్ర! సంధానశిలా
ఫలకమ్ముల పయిఁ జెక్కిన
పలువిధశిల్పములు నీకుఁ బ్రమదము గూర్చున్. 28

భువనేశ్వరి మంటపమున
భువనమ్ములు దద్దరిల్లి పోయెడు రీతిన్
దివిషదులు మెచ్చ సలిపెడి
శివ తాండవకేళిఁ గనుము శివపదహృదయా! 29

ప్రమథగణ గాయ కాత్మభూ పద్మనాభ
వాసవ షడాన నాది దేవతల మధ్య
డమరుకము చేతఁ బూని నాట్యమ్ము సేయు
హరు గజాసురసంహారు నరయు మువిద! 30

త్రిపురాసురసంహారము
విపులంబుగఁ జెక్కినారు వేలుపు టోజల్
చపలాక్షి, కనుము శ్రద్ధగ
నపురూపంబయిన శిల్పమది, యిచ్చోటన్. 31

శతమఖుం డేకదంతుండు జలజభవుఁడు
వాసుదేవుఁడు తన చెంతవచ్చి నిలువ
లోక సంగ్రహ శుభగుణాలోకుఁ డగుచు
నభయముద్రాంచితుండైన యభవుఁ గనుము. 32

కినుకన్ రుద్రుఁడు వీరభద్రుననుపన్ క్ష్వేళాకరాళధ్వనిన్
వెనుకన్ ముందును జూడకుండఁ జెనకెన్
వేల్పుల్ భయభ్రాంతులై తనుకన్,
సర్వము నాశనోన్ముఖముగా, దక్షాధ్వరధ్వంసమున్ గనినన్
భీతమృగాక్షి! చిత్తములు వైక్లబ్యంబు చెందున్ ద్రుతిన్. 33

అత్యుత్సాహముతో మథింతురదె
క్షీరాబ్ధిన్ గనుంగొనుమ్మటుల్
దైత్యుల్ కొందగు సర్పరాజఫణమున్ దర్పంబునన్ బట్ట,
నాదిత్యుల్ పుచ్ఛముఁ బట్టి,
మందరమహాద్రిన్ గవ్వమున్ జేయుచున్
బ్రత్యర్థుల్ పరమామృతార్థము
నిజప్రావీణ్యముల్ సూపుచున్. 34

దేవదానవు లబ్ధి మథించువేళఁ
గ్రుంగిపోయిన మంథర కుధర మెత్తి
యమరులను బ్రోచినట్టి నారాయణుండు
తాల్మి గలవేల్పు
కూర్మావతారుఁ డడుగో! 35

సంతానదోషములతోఁ
జింతించెడి స్త్రీలు పూజ చేసినఁ గరుణా
స్వాంతుండై శిఖివాహనుఁ
డింతుల కోర్కెలను దీర్చి యిచ్చును సంతున్. 36

అఖిలసృష్టికిఁ గారణ మైనవాఁడు,
సుర వెలుంగక వరముల నొసఁగువాఁడు,
నలుమొగమ్ములవాఁడు విజ్ఞానఘనుఁడు,
వనజభవుఁ డగు హంసవాహనుని గనుము. 37

మెలకువతోడ స్తంభముల మీదఁ బురాణకథా విశేషముల్
మలచిరి సుందరాంగి కనుమా! శివలీలలుఁ గృష్ణలీలలున్
జొలుపుగ, నబ్బురంబుగొలుపున్
రమణీయ లతా ప్రసూన సం
కలితముగా సముజ్జ్వలముగా భువనేశ్వరిమంటపమ్మలన్. 38

ఓ కల్యాణగుణాభిరామ కనుమా! యొయ్యారముల్ సూపుచున్
లోకుల్ మెత్తురో మెచ్చరో యనుచు నాలోచింప
కుతూహలంతోఁ
బ్రాకామ్య ప్రతిబుద్ధ చిత్తమున, సంప్రాప్తానురాగోన్నతిన్,
శ్రీకృష్ణ ప్రభు సన్నిధానమును జేరెన్ రాధ నిశ్చింతగా 39

నాథుని సేవఁజేసి భువనప్రియవల్లభు దివ్యభావనా
రాధనఁ జెంతఁజేరి మధుర ప్రణయాత్మ విపంచి మీటుచున్
మాధవు వేణుగాన రసమాధురిలోఁ బులకించి పోవు నీ
రాధను గాంచినన్ మనసు రాగమయమ్మగు నట్టివారికిన్ 40

కన్నులు మోడ్చి నీ యెడమ కాలి పయిన్ గుడికాలు సాచి యి
ట్లెన్ని యుగాల నుండి వినిపించుచు నుంటివో చిన్నికృష్ణ! య
భ్యున్నత భావగీతిక లపూర్వ సుధా సుషమా ప్రపంచముల్
కన్నులపండువై మురళిగానము వీనులవిందుఁ గూర్చెడిన్ 41

మనసిచ్చి మసలు నవయౌ
వనవతి, వివరింపరాని భావకవితయున్
వినిపింపని గీతమ్ములు
మనముల నలరించు మధురమధురములగుచున్ 42

అలరుచుఁ గాత్యాయని పూ
జలు సలుపఁగ వచ్చి, పూత సలిలమ్ములలో
జలకమ్ములాడు చెలువల
వలువలు హరియించి నవ్వు వానిం గనుమా! 43

కృష్ణుని లీలలు చూచుచుఁ
దూష్ణీంభావము వహించి తోలఁగం జనదో
కృష్ణాలక! శివ హృదయము
విష్ణువనెడు మాట లోకవిదితము గాదే! 44

కరములఁ జిరుకోలలు గొని
యిరుప్రక్కల నున్న చెలుల కెదురుగఁ జనుచున్
బిరబిర తిరిగెడు తరుణుల
నరయుము హరుసంబు గొలుపు హల్లీసకముల్ 45

కథలు చెప్పుచు, ముద్దులుకలిపి, యోగి
రమ్ము లెట్టుచు, తనదు గారాల పట్టి
ముద్దుపలుకులువిని కడు మురిసిపోవు
తల్లి ప్రేముడిఁ దన్మయత్వంబుఁ గనుము 46

ప్రముదిత చిత్తలౌచు మృదుపల్లవపాణి 'మృదంగభామినుల్'
ధిమిధిమి ధిత్తళాంగు తకధిమ్మను శబ్దము లుప్పతిల్లఁగా
సమకొని, నాట్యకత్తియలు స్తంభము చుట్టును మండలాకృతిన్
భ్రమణ మొనర్చురీతిఁగనుపట్టెడిఁ; గాంచుము నృత్యరీతులన్ 47

పట్టినముద్రలే మరలఁబట్టుచు వేసరి,
నట్టువొజ్జలిప్పట్టున నాట్యశాస్త్రపరిభాషలు తెల్పుచు
శిష్యురాండ్రకున్
నెట్టనఁజూపి నేర్పుదురు నేరుపుతోడఁ
దెలుంగుదేశపున్ నట్టువరాండ్ర భాగ్యముగ
నర్తనసేయు సజీవశిల్పముల్ 48

కలువపూరేకు దాకినఁ గందిపోవు
నట్టి సుకుమారి రాజకన్యకల పైన
బాణములు వైచి బాముల పాలు సేయు
కుసుమసాయకు గాంచు మో కువలయాక్షి ! 49

ప్రాయములోన నున్న జవరాండ్రు ప్రతాపధురైకదృష్టిఁ బు
ష్పాయుధు కొల్వుకూటములఁ జక్కదనమ్ములు చూపకున్న,
వాలాయము వారి సిగ్గడచి లక్షణముల్ వివరింతు రందు
వాత్స్యాయన కామసూత్ర విషయార్థములన్ సురసిద్ధదంపతుల్

అంగనామణి, కంటె ! యనంగరంగ
శాస్త్రమున గడితేఱిన జాణ యొర్తు
సిగ్గుఁబోనాడి వలరాచ చెయ్దములను
జుంబన విశేషములు రుచిచూపు చుండె 51

శాంతమూర్తి, శిల్పాగమ శాస్త్రవేత్త
వీతరాగుఁడు నగు నీ కళాతపస్వి
మిథునచిత్రములను జెక్కె మించుఁబోఁడి !
పంచశరవిద్య యందు నేర్పరి యితండు 52

ఎన్నియొ కళారహస్యమ్ము లిందుఁగలవు,
కలవు కలవెన్నొ కమనీయ గాథలిందు;
ఎఱుగ నవియెల్ల నేను నీ కెఱుక పఱుపఁ
దెలిసికొను మీవ యోచించి ధీరచిత్త ! 53

స్వాతిశయమూన స్వాధీన పతికయు
సంసిద్ధ వాసవసజ్జికయును
విభుఁడు వేళకు రామి వెఱగొందు విరహోత్క
ప్రియుని గానక కుందు విప్రలబ్ధ
మగఁ డన్య గామిగాఁ బొగిలెడి ఖండిత
యలిగి వందురు కలహాంతరితయుఁ
బొందుఁ గోరి కృశించు ప్రోషితభర్తృక
సఖుఁగూడఁ జను నభిసారికయును
హాన భావ విలాసమ్ము లతిశయింప
శిలల నొకయింతి నిన్ని రీతులుగ మలచె
ననుపుఁ బెనుపునఁ బూర్వపుణ్యమ్ము కలిమి
నవతె నిలిచెనో యీ శిల్పి హృదయ మందు. 54

అంబుజాక్షి ! మంది రాంతరాళ ద్వార
శిల్పములను జూడఁ జిత్ర మగును;
రాతి కంబములను రవళింప, సప్తస్వ
రాలు పల్కు హృదయరంజకముగ ! 55

గాయనగాయనీమణులు గానము సేయఁగ, నాట్యకర్త్రియల్
ప్రయోగముల్ రసానుగతిఁ జూపి నటేశ్వరు సేవఁ జేయ, రు
ద్రాయ నమశ్శివాయ శుభదాయ మముం గరుణింపరమ్మ శం
భో యని భక్తబృందములు పూజ లొనర్చి తరింతు రిచ్చటన్

నిష్కంపవృత్తమ్మ నీడ యోగసమాధి
    లో మున్గియున్న త్రిలోచనుండు
పరమేశ్వరున కెంతో భక్తితోఁ బరిచర్య
    సల్పవచ్చిన హిమశైల తనయ
సమయమ్మఁగని నారి సారించు తలఁపుతోఁ
    గుసుమాస్త్రమును గొన్న యసమశరుఁడు
నవ వసంతోదయ నానా ప్రసూన సౌ
    గంధ్య సంవాసిత గంధవహుఁడు,
కనులు దెఱచి శివుఁడు కల్యాణిఁ గనెఁ బ్రేమ
    తావళం బొసంగెఁ దలిరుఁబోఁడి
పుష్పబాణుఁ జేసె ముక్కంటి చిచ్చఱ
    కన్నుఁ దెఱచి యతనిఁ గాల్చివైచె 57

పరమేశ ప్రణయినివై
పరవశవై తపముసేయు పార్వతివలె నే
సురకన్య నిన్ను మది నిడి
చరితార్థంబైన పూజ సలిపెనొ శిల్పి. 58

మధుపర్కంబులు గట్టి పీటలపయిన్
    మందాక్షభారమ్మునన్ వధువై శైలజ,
    చంద్రమౌళి వరుడై భాసింప,
    సప్తర్షులున్ బుధులున్ జేసెడి
    పార్వతీ పరిణయంబున్ జూచెఁ బూఁబోడియున్
మధురోహల్ చెలరేగి సిగ్గు జనియింపన్ హర్షబాష్పమ్ములన్

అచటి విగ్రహముల నాశ్చర్య చకితమై
చూచు, స్థపతిచంద్రుఁ జూడనెంచు,
నతని మెచ్చుకొనుచు నానందపడు లోనఁ,
గోప మభినయించుఁ గొంతసేపు. 60

తన రూపె కన్పించుఁ దమిఁ జెంచు తేని బు
జాన వ్రాలిన బోయసాని యందుఁ
దన సోయగమె తోఁచి తనియించు నందాల
దీవిఁ బోలిన రతిదేవి యందుఁ
దన రాచఠీవియే కనిపించు దర్పాన
మగవేసమున నున్న మగువ యందుఁ
దన యపూర్వాంగ సౌందర్య రేఖలె తోఁచు
నమరనారీ విగ్రహముల యందుఁ

దన మనోహర రూప సందర్శనమునఁ
దనివిసెందక యిన్ని విధాల మలచె
నెంతటి కుశాగ్రబుద్ధియో యీతఁ డనుచు
భావమున మెచ్చె రుద్రమదేవి యపుడు 61

ఏ విగ్రహములఁగనిన నా
కే విధమగు రూపురేకలే వెలయునహో!
ఈ వైచిత్ర్యము శిల్పము
లీ వింతయు సోయగమ్ము లెందును గలవే! 62

నాట్యశాలనేను నడచిన నడకలు
పట్టినట్టిముద్ర లట్టె మలచె
వివిధ భంగిమలను విన్నాఁడో కన్నాఁడో
విస్మయమ్ము గొలుపు వీనిఁ జూడ! 63

కమనీయ ప్రతిబింబమైన గిరిజా కల్యాణ ఘట్టంబులో
నుమ తానైన మహేశ్వరుం డెవఁడుగా
నూహించుకొన్నాఁడో పా
పము! నే నెవ్వతెనో యెఱుంగఁ డతఁ డవ్యాజానురాగానుబం
ధము రమ్యంబుగ నిల్పె శిల్పరచనాధౌరేయుఁడై యిచ్చటన్

అమరప్రేమఁ గళాతపస్వి యొకఁ డత్యంత తానురక్తి ప్రధా
నముగా నిండు మనంబు తోడ ననుసంధానించె, నాయందచం
దము లీరీతిని రాకుమారికలఁ గన్నన్ డెంద ముప్పొంగు, ని
క్కము జన్మాంతర సౌహృద ప్రముఖ సంస్కారంబు లీ
బంధముల్ 65

ప్రణయ గౌరవమున రాణి రుద్రమదేవి
సజల నేత్ర యగుచు సమ్మదమున
రాజశిల్పియేడి ? రప్పింపు మనినఁ గా
త్యాయనియును గద్గదస్వరాన. 66

"కఠినచిత్తము గల కాంత కై తపించి
పాలవలపుల నీ రాలపాలు చేసి
మమతలను బెంచుకొన్న కోమలిని వదలి
రాజ్యమును వీడి చనె నెటో రాజశిల్పి" 67

అనినన్ భీషణ వజ్రపాత మయినట్లై గుండె లల్లాడఁగా
కనుదమ్ముల్ కమలాకరమ్ములుగ శంకాసంకులస్వాంతయై
వనితామండన రుద్రమాంబిక నిజప్రారబ్ధ సంరుద్ధయై
తన సర్వస్వముఁ గోలుపోయినటు సంతాపించె నిర్విణ్ణయై 68

"పురము విడనాడి గజరాజు పోవునపుడు
శిల్పసుందరిఁ బోలిన చెలువమున్న,
కూర్మి నెపుడేని ననుఁ జూడఁ గోరెనేని
నిమ్మనుచు నిచ్చె నొకలేఖ నిపుడ తెత్తు" 69

"సరవి జాయాసమేతులై శశక రుచక
భద్ర మాలవ్య హంసాది పంచ పురుషు
లరుగో! గర్భాలయ ద్వార మందు నిలిచి
స్వాగతము పల్కుచున్నారు చాన నీకు" 70

అని కాత్యాయని వోయిన
ఘన చింతా తప్త యగుచుఁ గర్మానుభవ
మ్మున కెఱియుచు రుద్రమ శి
ల్పిని దలచుచు మ్రొక్కె రామలింగేశునకున్ 71

శ్రీ విశ్వేశ్వరశంభు దేశికుల యాశీర్వాదముల్
మత్పితృశ్రీ వాక్పాలన మీ
త్రిలింగ ధరణీ శ్రీ రక్షణోద్యోగమున్
లావై, విప్లవవీరులన్ రిపుల గూల్పన్ దీక్షలం బూని, నిన్
భావంబందున నిల్పి, రానయితి దేవా రామలింగేశ్వరా! 72

తలపడి ఖడ్గయుద్ధమునఁ దాకుచు దుష్ట కళా వశమ్మునన్
గెలిచిన వాని భార్య నయి కేళితలమ్మునఁ జేరి తన్పఁగా
వలసినఁ, దాని లోకముగ భావన చేసి కళాప్రపూర్ణుఁడై
వలచినవాని పాదముల వద్ద హృదబ్జము నుంపరాదొకో! 73

చతురత నాంధ్రరాజ్యమున శాంతియు భద్రతఁగూర్ప, నిష్ఠుర
వ్రతముల గుప్తరాగ పరిపాక నికుంజము వోలె నాదు జీ
వితమది శత్రుసర్ప పరివేష్టితమై కడు దుర్భరంబుగా
మతిసెడి నిన్నుఁజూడ నొకమారిటురాక యఘం బొనర్చితిన్

శ్రవణానందముగా శివోహమనుచున్; శంభో, మహాదేవ హై
మవతీవల్లభ, వెల్గుచూపు మనుచున్; మందారపుష్పమ్ములన్
శివలింగార్చన చేసి కేల్మొగిచి నిల్చెన్ దైవసాన్నిధ్యమం
దవనీనాథతనూజ రుద్రమ మనోఽహంకారదూరాత్మయై 75

# నిర్వేదము

ఆ కొలని పొంతఁ గలిసికొన్నపుడు నీవు
కలికితనమున లేఁతబుగ్గలు చెమర్ప
నేల బొటవ్రేల వ్రాయుచు నెనరు దోప
నిపుడు కాదని పల్కితి వెపుడో యింక ! 1

వలపు లూరించు వన్నెచిన్నెలను జూపి
విరులఁ జేసిన బాసలు విస్మరించి
మరల మోమైనఁ జూపవు మధురవాణి
కోమలుల మాటలను నమ్ముకొనఁగ నగునె ! 2

ఒకరిని జూడ నార్ద్రమగుచున్నము;
వెండియు వారిఁజూడ వేడుక గలుగున్;
యథేచ్ఛగ నటుల్ దమకమ్మునఁ జూడఁజూడఁ
గోరికజనియించుఁ,
గోర్కె పలురీతుల వ్యక్తమగున్,
ఫలాప్తి కుత్సుకతను జూపు మోహము;
విశుద్ధమనమ్మునఁ బ్రేమ వర్ధిలున్ 3

ఒక వాల్చూపు పాక కదలిక
యొకదరహాసమ్ము చేతనో ద్బోధకమై
చికమకలు వెట్టి కలచున్
సుకృతుల డెందములు స్నేహసుధలయి వెలుచన్ 4

అరవిందానన ! నీదు రూప మొకనాఁడాశ్చర్యమున్ గొల్పఁగా
నిరపేక్షంబుగఁ జూచి మెచ్చితిని గానీ,
యంతరంగంపు లోపొరలన్ బాదులు గట్టుకొన్నయది;
రూపుల్ దిద్దుచో
సంతతస్ఫురణన్ గన్నులముందు నిల్చి,
మది నేచున్ వాంఛలన్ రేపుచున్ 5

విశ్వమోహిని ! ప్రేమరూపిణివి నీవు,
విశ్వకల్యాణ గుణ కళాప్రియుఁడ నేను;
నీ కరుణ చేత నా చేత నిగ్గు దేలి
మదనికామూర్తు లలరు నీ మందిరమున 6

నరులకు యౌవనాఢ్యులకు నైజము కామము, కామజుష్టమై
తరుణిమ తాండవించుఁ బరతత్వ మెఱుంగక, రామలింగ మం
దిరమున నర్తకీగణము నిల్పితి శిల్పకళానురక్తి నీ
శ్వరు దరిఁ జేరఁజాల *రలసాలలనల్ తెరువీయకుండినన్ 7

ఒక సౌందర్యము రూపు గట్టుకొని నా యూహన్ ప్రవేశించి,
నర్తకి పోలెన్ రతి పోలె నాగిని వలెన్
ప్రాలేయభూభృత్కుమారిక పోలెన్ గజలక్ష్మి పోలె
సకలస్త్రీమూర్తి సంస్పృష్టమై
ప్రకృతంబై హృదయైకవేద్యమయి
నిర్మాణక్రియన్ వెల్వడెన్ 8

ప్రాణములోని ప్రాణముగ భావమునన్ వసియించి, నీవు నా
రాణిగ నిత్యమున్ హృదయరాజ్యము నేలుదు వంచు నెంచి వి
న్నాణముతోడ శిల్పరచనల్ వెలయించితి;
ఆంధ్రదేశపున్ రాణిగ రాజ్య మేలఁగల
రాజకుమారి వటం చెఱుంగమిన్. 9

నీవు నాదాన వను ప్రేమభావమే, మ
హోజ్జ్వలమ్మయి జీవనజ్యోతి కోటి
దీప శిఖ లట్లు వెలిగె, నా దీప్తి తోడఁ
బలువిధమ్ముల శిల్పముల్ మలచినాడ 10

*అలసాలలనల్ = నాసికాప్రతిమలు

విరు లవి యెన్నియున్నఁ గనిపెట్టి మధువ్రత మేల పద్మినీ
పరతఁ బరిభ్రమించు? శతపత్త్రము మిత్రుని జూచినన్
వికస్వర మగు నేల?
యేల కలువల్ వికసించుఁ గలానిధిన్ గనన్
బరగఁ బరస్పరానుగత భావ రహస్య మెఱుంగ వచ్చునే? 11

గత జన్మంబునఁ జెల్మి చేసియును
గాంతుల్ దీరకే జీవితక్షితి లోకంబును వీడియుండు మకటా!
కా దేని నీ జన్మలో
నతుల ప్రేమ జనింప నేల యిటు లవ్యాజమ్ముగాఁ
బూర్వ సంస్మృతు లొక్కప్పుడు సంచలించి
మదిఁ బ్రేరేపించు నవ్యక్తమున్ 12

అమర మగు రామలింగేశ్వరాలయమ్మ
నంకిత మొనర్చినాఁడఁ గల్యాణి నీకు
నీవు మెచ్చని యీ రామణీయకమ్మ
లడవిఁ గాచిన వెన్నెల లగును సూవె! 13

అక్కటా! రాగలహరి! నా యంతరంగ
మెఱిగి వర్తింప లేకపోయితివి గాక!
ముగ్ధ మోహన సౌందర్యమూర్తి, నీకు
మేలు లేకున్న నీ లోక మేల నాకు? 14

రత్న సింహాస నాసీనురాల వగుచు
జనులఁ బాలించు చక్రవర్తినివి నీవు
నీ పదాంభోరుహములఁ గన్నిటి ఝురులఁ
గడగఁ జాలని మందభాగ్యుఁడను నేను 15

పరువంపుం జిగితోడ మాదృశుల త్రోవన్
జంచల ద్రుమ జ్మనోహార హేలా నవమల్లికల్ విసరి,
సౌహార్దమ్మునన్
మంజు కుంజ రహ స్స్వాదు సమాగమంబుల
మహోత్సాహంబు గల్గించి, యీ
సరసున్ జూడగరావు క్రమ్మఱ దిదృక్షున్
వ్రజచేతస్కవై 16

కొంచెము కొంచె మీ యెడఁదకున్ సరిదాకుచువచ్చి,
ప్రాక్తనో
దంచిత పుణ్యరూప వనితా ప్రియతా రజతాద్రి శృంగ మె
క్కించి, సరాగమాడుచు, మృగీనయనాంచల !
యొక్కమారు దొ
ర్లించితె త త్ప్రపాత పతి తేప్సితు
రాగ విదూరుఁ జేయుచున్ 17

వేయి చుక్కల సొబగుతో వెలుగు నీవు
నన్ను దయతోడఁ జూతువన్ భ్రాంతి తోడఁ
గనిన కలలెల్లఁ గల్లలై కరగిపోయె
దిగులు గుండెయుఁ గన్నీళ్ళు మిగిలె నాకు 18

పిలిచి, పలికించి, నవ్వి కవ్వించి పోయి
కనబడకయుండు కాంత నే మనఁగ వలయు ?
మాన వాతీత మహి మాధ్యమైన మూల
శక్తి యొకడున్న దాని కంజలి ఘటింతు. 19

మనము నిమిత్తమాత్రులము మానిని ! సర్వము నీశ్వరేచ్ఛగా
ననువుపడున్ జనావళి, కహంకృతి జ్ఞానవిహీనుఁడంతయున్
దన ఘనకార్యమంచు మది దైవము నెంచడు యోగకాల మం
దనునయ మొందు దైవవిధి యంచుఁ దదర్థములెల్లఁ జాల్లువో

ఎరుగనె నీ మనమ్ము హృదయేశ్వరి !
నా పయి నేలకో కోపమూని యీ తెరువున రావు గాని
పరదీన మనస్కు-ని నన్ దలంచినన్
గరఁగక యుండునే మనమొకప్పుడు,
వత్సలతా ప్రపూర్ణ సుందర సుమనః ప్రసన్న వదనమ్మున
దర్శన మీయకుండువే ? 21

కనిపించు చూడు నీ కడకంటి కాంతిలో
బిడియానఁ బైకిఁ గన్పడని బాధ
మురిపెమ్ము లొలుకు నీ ముసిముసి నవ్వులోఁ
దెరయెత్తు నీదు సిగ్గరితనమ్ము
నెనరూని చెమరించు నీ కపోలములలో
నగపట్టు నీ గాఢమయిన తలఁపు
నిట్టూర్చు చుండు నీ నీలిముంగురులలో
పలుమారు మదిలోని కలవరమ్ము

నీ నిరంతర రమ్య సన్నిధిని గోరి
నీవు చూపెడు త్రోవలనే చరించి
చెలిమికలిమిని నీ లోనఁ గలసి పోవఁ
గలలు గనుచుంటి నిన్నాళ్లుగా లతాంగి 22

ఎరుగవా నీవు నా హృదయ మెంత పవిత్రమొ ?
వేదనాగ్నిసంభరితమొ !
యెన్నినాళ్ళ నిను భావమునన్ భజియించి నాడనో
తరుణి ! భవన్ముఖాబ్జ శుభ దర్శనభాగ్యము గోరి
తత్సరోవర నికట స్థలంబుల నవశ్యము
నీకయి వేచియుంటినో ! 23

ప్రేమమయమైన నీ యెద విప్పి చెప్ప
మధుర మధుర క్షణమ్ము లుమ్మలికఁ బాపి
పోచునని ప్రత్యహమ్మును వేచి వేచి
విసిగి వేసారినాడ నో బిసరుహాక్షి ? 24

ఒకసారి కౌతుకమ్మొప్పారఁ గ్రేఁగంట
వీక్షించి పోయెనే విమలనయన,
ఒకసారి దరిఁజేరి యొయ్యారములుచూపి
తులకించిపోయెనే తలిరుఁబోఁడి,
ఒకసారి స్నేహపూర్వక హేల నువ్విళు
లూరించిపోయెనే యుజ్జ్వలాంగి,
ఒకసారి చిరునవ్వు లొలుకుచు మనసిచ్చి
మాటాడి పోయెనే మంజువాణి,

అట్టి మధురమూర్తి నానందవిస్ఫూర్తిఁ
గాంచలేక, బ్రదుకఁ గాంచలేక
ధర్మపథము దవిలి, ధన్యోస్మి యనుకొందుఁ
గనికరములేని కఠిన హృదయ !! 25

వచ్చినట్టులె వాన వచ్చియాగిన భంగ
పడి కుందు చాతకపక్షి పగిది
మండుటెండలకు నీ ళ్లెండిపోయిన నది
మెఱసి కొట్టుకులాడు మీను కరణి
సుడిగాలి దెబ్బచేఁ జుక్కాని సుడివోవఁ
దికమకలాడు నావికుని రీతి
దేహమ్ము విడనాడి దిగులుచేఁ బోలేక
వ్యగ్రమై పోవు జీవాత్మవోలె

ఆశలు నిరాశలై జీవితాశ వదలి
దిక్కుదోచక బంధముల్ ద్రెంప లేక
పోవుచున్నాఁడ నే లోకములకొ దేవి
మరల నిను గాంచు భాగ్యమంబరమునంట! 26

నీ వెవరో యెఱుంగనిది నిక్క మొకప్పుడు, గాని యిప్పుడో
దేవి! భవత్కృపా రహిత దీర్ణ హృదంతరు, నిర్మలాశయున్
నీవు నిరీహతో మరువనేర్చిన నేర్తువు గాక! యింతలో
నీ వెవరో యెఱుంగ నటు నే నిటనుండఁగ లేను నీవలెన్ 27

మరచి పోలేను నేను నీ మన్ననలను
మమతలను వీడి నిశ్చింత మనగలేను
నిను స్మరింపక క్షణమేని నిబ్బరముగఁ
గడుపఁ జాలని నాకేమి గతి శుభాంగి! 28

కళల కాణాచి యగు నొక్క కలువకంటి
చికిలి చూపుల మధు మరీచికలు చూచి
భ్రాంతిపడి యిన్నినాళ్ళు సర్వమ్ము మఱచి
యుంటి సదసద్వివేకశూన్యుండ నగుచు. 29

మదనోద్వేగముతోడ, దుర్భరమనోమాలిన్యసంపీడనన్
హృదయమ్మించుకలేని నీహొయలు
నన్నెంతేనిఁ బ్రేరేచ, నా
బ్రదుకే బండలు చేసికొంటి నిటు
రూపశ్రీకళారాధనన్
ముదితా నేరుపుఁజూపుచున్
మదనికామూర్తుల్ వినిర్మించుచున్ 30

ఈ శిల్పమ్ములు చూచి మెచ్చుకొనువా రేరీతి భావింతురో!
యాశాపాశములన్ దెమల్చికొని ద్వంద్వాతీతచిత్తుండనై,
శ్రీశైల భ్రమరాంబికాచరణరాజీవ ప్రభాచక్రచ
ర్చాశక్తిన్ బరతత్త్వతత్పరతనారాధింతు నాత్మేశ్వరిన్ 31

విషధరగృహా నిర్మితఁ గి
ల్బిషహారమగు గాక! నాకుఁ;
బ్రియమగు నీకున్
విషమపరిస్థితు లెదురై
విషయత్యాగంబు చేసి వెడలుచునుంటిన్ 32

తరితీపుం దలపులతో
నిరాశతో నిభృతమయిన నిట్టూర్పులతో
బరువెక్కిన హృదయముతో
భరింపలే కేగుచుంటి పడతి! యెచటికో 33

శివభక్తురాల వీవును,
శివభక్తుఁడ నేను; స్నేహశిఖ సత్యంబై
శివమై సుందరమై, శాం
భవి కృప వెలుగొందు గాత భవ్యంబగుచున్ 34

రామసాగర పరిసర ప్రాంతములకుఁ
బ్రకృతి దృశ్యములను జూడవత్తువేనిఁ
గువలయేక్షణ! రామప్పగుడిని నీదు
సోగకన్నుల నొకమారు చూచి పొమ్మ 35

# అనుతాపము

అబ్జదళ శోణ బిందు రేఖాత్మకముగ
ముంగిళుల ముందు మువ్వన్నె ముగ్గు వేసి
భూపురంబుల మంకెనపూలు చల్లి
పండుగ దినాల సంబరపడుదు రాంధ్రు. 1

అలవోకన్ విరివిండ్లు చేకొని,
ధనుర్జ్యాముక్త చూర్ణాంచితుల్
తలిదండ్రుల్ ముదమందగా,
జయజయ ధ్వానమ్ములన్ జేసి,
కోతుల నాడించుచుం
బప్పుబెల్లములు సంతోసమ్ముతోఁ బంచి
వర్ధిల్లుఁ డంచున్ బడిపిల్ల లెల్ల రెలమిన్
దీవింతు రొక్కుమ్మడిన్ 2

పులి వేసమ్ములు వేయు వారలును
నేర్పుల్ చూపుచున్ బండ్లపైఁ
బలు వేసమ్ముల ధూపదీపములతో భక్తిన్ మహాకాళికిన్
బలిదానమ్ములు సేయు వీరులుఁ బరాభట్టారికారాధనా
కవితాత్ముల్, ప్రజ లోరుగంటి పురి
నాకర్షింతు రుద్ధర్షులై 3

శక్తి పూజలు చేసి యంజలి ఘటించి
పిశిత సంయుత మళిపాత్ర స్వీకరించి
శత్రునాశన మొనరించి జయము గూర్ప
మనుచుఁ బ్రార్థింత్రు జగదంబ నఖిల జనులు 4

కలశమును బెట్టి పలు విధ
ముల సకల సుగంధపుష్పముల దేవీ పూ
జలను శరన్నవరాత్రుల
సలుపుదు రటఁ గాకతీయ చందనగంధుల్ 5

వెనుకకు ముందుకున్ బదము వేయుచుఁ
జప్పటు లప్పళించుచున్
వనితలు మండలాకృతిగఁ బాటలు పాడుచు,
నాట్యమాడుచున్
ఘనముగఁ బూజసల్పి,
బతకమ్మను గొల్తురు భక్తితోడ, నా
దినముల, సర్వ కామ్యములు దీరి
శుభమ్ములు కల్గు నట్లుగన్ 6

కోలాటమ్ములు భజనలు
ప్రో లెల్లను మారు మ్రోగు రుంజల ధ్వనులున్
మైలారు భటుల బొబ్బలు
మేళమ్ములు సాము గరిడి మించెడి వేడ్కన్. 7

సరస సంగీత సాహితీ సార గోష్ఠి
నేత్రపర్వముగా శరద్రాత్రులందుఁ
నాగరకులెల్లఁ గౌముదీ జాగరములు
సేయుదురు చంద్రశాలలఁ జిత్తమలర. 8

రాణి రుద్రమ ప్రాసాదరాజ మందుఁ
జంద్రికలఁ దేలు చల్లని సమయ మందుఁ
దలపునకు వచ్చె శిల్పి ప్రధాన రచిత
పత్త్రి నిర్వేద నిష్ఠురభావ మహతి 9

కాంత నయనాంచ లోజ్జ్వల కాంతిపూర
మందు రూపందు నాతని యమృతమూర్తి;
యువిద కలరూపుఁ గాంచి పెల్లుబుకు ప్రేమ
నందుకొనుచుండె నిష్కల్మ షాత్మసుభిక్షు 10

"రమ్య శిల్పములను రచియించుకొను కళా
కుశలు నేలఁ గలిసికొంటి! వతని
రసికహృదయ మేల రగిలించె నా యంత
రాత్మ లోన శీతలాగ్ని శిఖలు! 11

"ఎంత సుకుమార మాతని యెడఁద! యెంత
మధుర మాతని ప్రణయమ్ము!! వ్యధితచిత్తుఁ
డెంతగా నన్ను గూర్చి భావించినాఁడొ?
యెంత వలవంత నిట్టూర్చి యేగినాఁడొ? 12

"విజయదశమీ మహోత్సవ వేళ,
విబుధ పరిష దధ్యక్షురాలనై
ప్రస్తుతించి
శిల్పివరునకుఁ బారితోషికము లిచ్చి
స్వయముగా సత్కరింపఁగఁ జాలనైతి. 13

"అతఁ డలౌకిక దరహాసి తానుండు
కనఁబడిన మేను పులకించుఁ గదలు నెడఁద;
తీయతీయని వింత గీతికలు పాడ
వేయి వీణలు శ్రుతి గల్పి వేడ్క సేయ. 14

"ఎవ్వ రే మనుకొన్న నా కేమి యనుచు
వానిఁ గనఁబోవు చుండెడి దాన నెపుడు
సమయ విస్ఫూర్తి మిత్త్రి తేజమ్ముఁ జూచి
ముదము గను ప్రొద్దుతిరుగుడుపువ్వు వోలె. 15

"స్నేహమో! మోహమో! కమనీయ గుణవిశేషమో!
గత జీవిత శేషమో!
పరస్పరాశ్లేష పరితుష్టిఁ బ్రణయభావ బంధురమ్మయి
విడరానిబంధమయ్యె! 16

"ఆ రమణీయమూర్తి హృదయంబు వికావికలై విరక్తితో
నేరికిఁ జెప్పకుండఁ జనియెన్ గట!
శూన్యజగత్తులోని కో
తారకలార! మీ రతని దారి వెలుంగులు గ్రుమ్మరించి,
న న్నారయు నట్లు సేయుఁ డెపుడైనను;
మీకు శుభమ్ము గల్గెడిన్ 17

"ఆ మహనీయమూర్తి దరహాసరుచుల్ గిలిగింత వెట్ట, నే
నే మని చెప్పఁదున్ బ్రియున కా సమయమ్మున నెంత వింత భా
వామృత మాధురుల్ తరగలై తలలెత్తెనో
నా యెడందలో
నే మనుకొందురో కో—! యెవ రేనియుఁ జూచిన
నా తృణమ్మనన్" 18

ఆ విధమ్మునగఁ దలచుచు నంతలోన
స్నిగ్ధహృదయుఁడు రసమయజీవనుండు
కనులఁ గట్టిన చందమై కళవళపడి
దీమసమ్మున రుద్రమదేవి పలికె 19

"నిండు మనముతోడ నీలోన మెదలు నా
నీతలంపుఁ గలియు నెపముతోడ
నిన్నుఁ జేర వత్తు నిను జూచి హర్షింతు
నిను దలంచుచుందు నిర్మలాత్మ! 20

"నీ దరిఁ జేరి నంత,
మది నించు ననిర్వచనీయ మాధురీ వేదన లొక్క ప్రక్క,
నతివేల సుధా ప్రణయైక భావనామోదను లొక్క వంక,
బరిఫుల్ల హృదబ్జ పరిమళ ప్రభా దీధితు లొక్క క్రేవ,
నను దిన్నఁగ నచ్చోట నిల్వ నిచ్చెనా? 21

ఆ శిలాప్రశ్రమ వాటికా ప్రసృత సంధ్యారాగరేఖాంచిత
శ్రీ శృంగారములో హాసన్ముఖుఁడవై ప్రేమన్ ననున్ బిల్వ,
వాంఛాశూన్యంబుగ నుండలేక,
విచికిత్సన్ జెంది, పోరామిఁ
బ్రత్యాశన్ బజ్జఁ జరింపలేక,
చనినా నంతే ప్రియంభావుకా 22

సంజ కెంజాయ రేక లాశలు ఫలింప
నలరుఁబ్రాయంపుటిరుల నైక్యమయి పోవ
సంశయించెడి సమయానఁ జాలు చాలు
కే లొడిసిపట్టు నట్లు వీక్షించెదేల? 23

మనలో మాట,
మనోహర ప్రణయ వాఙ్మాధుర్య ధుర్యాత్ములన్
గని, యావేళను ప్రేయసీప్రియుల కానందంబు సంధించు
చిక్కని జ్యోత్స్నల్ వెదజల్లి మించ
రజనీకాంతుండు విచ్చేసినన్
మనలన్ మంజులభావపూర్ణుల
నటుల్ మాటాడుకోనిచ్చునే? 24

'క్రొన్ననఁబోఁడి,
నీదు సొబగుల్ గనఁ జిత్తము పల్లవించు'నంచున్
నను బ్రేమపూర్వముగఁ జూచుచుఁ గౌగిటఁ గారవింప,
విద్యు న్నిభ చంచలద్ద్యుతులతోఁ
పులకాంచితగాత్రవై త్రపన్
గన్నులుమోడ్చి,
నీ ప్రణయగౌరవ మెంచి సుఖింతు నాత్మలో 25

అమృత ర సానులాపముల నర్మిలి చూపుచు,
నంకపాళిపై సముచితరీతి నిల్పికొని,
సారెకు ఫాలతలమ్ము ముంగురుల్ నిమురుచు,
లేఁ గపోలముల నిగ్గులు చూచుచు,
లోచ నాబ్జ పత్రములను ముద్దుగొన్న మధురక్షణముల్
మరువంగ నేర్తునే? 26

ఎద పులకించు శిల్పముల నెన్ని రచించినఁ గాని,
యెవ్వరీ హృదయ మెఱుంగ నేర రని యెగ్గులు పల్కెద
వంతే, గాని నా
హృదయ మెఱింగియే యటుల నేగితివా *గజరాజ నీవు?
బుద్బుదసమముల్ శరీరసుఖముల్
తమకింతురె వానికై యిటుల్! 27

* రామప్ప శిల్పియొక్క సంకేతనామము

నీ సెనరెంచి,
యొక్కపరి నిన్నభిమర్శన చేసి పోవఁగా నైనను వీలులేక,
విరహాగ్ని భరింపఁగ రాని వేదనల్
లోన దహించుచుండ – మదిలోఁగొనఁజాలని నెయ్యురాల
నీదానసె – యేమి చేయఁగలదానను ?
దుర్విధి యడ్డువచ్చినన్. 28

ఒక్కనాడు నిన్నుఁగన నువ్విళులూరును నా మనమ్ము; నీ
వక్కడ లేవటన్న నిజ మారసి కన్నులు కాల్వఁగట్టు; నీ
యక్కన వ్రాలి పండురఁగ నైనను దుర్లభమాటఁజేసి; నీ
వెక్కడి కేగినన్ జెలిమి యేర్పడి యుండినఁ జాలు నెయ్యరీ! 29

నీ హృదయంబు నవ్యనవనీత సమానము,
నన్నుఁ జూచి వ్యా
మోహముతోడ నీ భువనమోహనశిల్పములన్ వెలార్చి, నా
స్నేహము గోరికొన్న మహనీయుఁడ,
నేను త్రిలింగదేశ వి
ద్రోహుల యుక్కణంప ననిఁ ద్రుళ్లుచు
నిన్నును విస్మరించితిన్, 30

నాకు హృదయమ్ము లేదని నావు
నీకు హృదయ మున్నట్లు నేను గుర్తించినాను;
ప్రియసఖా ! యూరకొంటి
నా ప్రేమ యెంతయగ్గలమొ
కొల్చి చెప్పుట కలవిగాక ॥ 31

ప్రణయమును బాధ పర్యాయ పదము లగుచు
మనల నిర్జించె విధి వశమ్మున మహాత్మ!
యేమి ప్రణయమొ? యీ జన్మ కిట్టు లాయెఁ
గలఁత పడనేల గతజన్మ కథల తోడ. 32

హృదయ మర్పించి సేవించు ప్రేమమయుఁడు
దొరుకుటే యరు; దొకవేళ దొరకెనేని
సంఘ మెడలించు; నదియుఁ బ్రసన్నమైన
నినుపతెర డించు దురదృష్ట మేపగించి. 33

ప్రేమము వ్యథాకులంబైన మృతియె మేలు
మరణము కఠోర మీ ప్రేమ మధురమైనఁ
బ్రభుత ప్రజలకు మార్గదర్శకము గానఁ
దగులములు మాని చరియింతు ధర్మదీక్ష. 34

కాని, నా జీవితమ్మున లేని స్వేచ్ఛ
మృత్యు ముఖమునఁ బడయుట లెస్స యగునొ?
ఉన్నదో లేదో పరలోక మున్న నచట
నేమి జరుగునో నమ్మక మేమి గలదు? 35

చావు తప్పదు జీవికి; జనన మొందు
టనవసర మదె పరమార్థ మాయె నేని;
బ్రతికి నన్నాళ్ళుఁ బరహితార్థ ప్రవృత్తిఁ
బ్రదికెదను; జచ్చి సాధించు నదియు లేదు. 36

కాంతు లన్నియుఁ దీరు మార్గములె యున్న
లోక మిట్లుండు నొక్కొ ?
త్రిలోచనుండు విలయతాండవ మొనరించు;
విశ్వమెల్ల వల్లకాడగు,
మిగులును వట్టిమట్టి. 37

మనసులోని వ్యథలు మరులు తెల్పఁగ లేక
గుండెరాయి చేసికొంటి నోయి !
రాచపుట్టు వయిన రమణి జీవిత మొక
పంజరంపుఁజిలుక బ్రతుకు గాన. 38

తీయని బాధలున్, దనివి తీరని కోర్కులు
గుండె భారమై మోయఁగ లేని వేదనలు
ముం దెటులుండునో యన్న యోచనల్
నా యెదఁ గ్రుంగఁ దీసెడి ననారతమున్,
నినుఁగూడి యెట్టులో
హాయిగఁ గొండకోనల విహారము సల్పఁ
దలంపు గల్గెడిన్. 39

ధర్మయుద్ధము చేసి, శాత్రవుల గెలిచి
పదిలముగ రాజ్యమేలంగ వచ్చుగాక,
ప్రణయ గంధము లేని జవ్వని సొబంగు
స్రుక్కిపోవదె నిర్గంధసుమము వోలె 40

ప్రణయ రసానుభూతి ప్రచురమ్ముగ,
నిమ్మెయి నంతరాత్మఁ బ్ర
త్యణువు ప్రభూ ప్రభూ యని యహర్నిశలున్
గళమెత్తి పిల్చెడిన్
క్షణ మొక రీతిగాఁ గడచుఁ గాలము;
నాదగు సర్వమున్ సమర్పణ మొనరించి
నీ పదములన్ బడియుందు రజఃకణమ్మునై. 41

చెలిమిమై నన్ను నీ చెంతఁ జేర్చికొనవె
చెలువముల కాటపట్టగు చెలిమి చుక్క
శాంతి కరవయి దేశదేశాలు తిరుగు
ప్రియుని గని మిన్క మిన్కని వెలుగుచుందు. 42

# అంకితము



నయ వినయ సుగుణ సంప
చ్చయ సంతానాది సకల సౌఖ్యములిచ్చున్
దయతో శ్రీ లలితాంబిక;
ప్రియ! బాలాత్రిపురసుందరి! శ్రీలహరీ!

దివ్యాక్షర మృదు భావ ర
సవ్యాప్తృతమగుచు సప్తసంతానములన్
గావ్యము ప్రశస్తమైనది;
భవ్యంబగు దీని నీ కుపాయనమిత్తున్

ఈ కావ్య కన్యకామణిఁ
జేకొని వత్సలతఁ బ్రోదిసేయుచు దీనిన్
సాకెదవు గాక! నీకును
నాకును మోదంబుగూర్చి నయగారములన్

సత్యనారాయణ

# స వ ర ణ లు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| V | 17 | కలలెన్నో | కలవెన్నో |
| 4 | 4 | నిన్నుజూచిపో | నినుజూచిపో |
| 5 | 3 | చేతశ్మిఖీ | చేతశ్శిఖి |
| 6 | 3 | "రూపురేక''లును | రూపురేకలును |
| 7 | 6/7 | బుక్కాముులు | బుక్కాముులు |
| 8 | 18 | హో రంగుల | హొరంగుల |
| 9 | 2 | రోథస్థ్వలిపై | రోధస్థ్వలిపై |
| 9 | 18 | చలనోజ్ఝితమో | చలనోజ్ఝితమో |
| 10 | 16 | పూరజన్మ | పూర్వజన్మ |
| 11 | 11 | చరిత్రులు | చరిత్రలు |
| 15 | 11 | నభిమావ | నభిమాన |
| 20 | 1 | శిల్పములుధిద్ది | శిల్పమ్ములు దిద్ది |
| 22 | 11 | పాగల్భ్య | ప్రాగల్భ్య |
| 27 | 10 | భుజగేంద్రునిపై | భుజగేంద్రుపై |
| 32 | 15 | గనుంగొనుమ్మటుల్ | గనుంగొమ్మటుల్ |
| | 18 | మహాదిన్ | మహాద్రిన్ |
| 34 | 22 | రమ్ములెట్టుచు | రమ్ము వెట్టుచు |
| 44 | 8 | స్రీమూర్తి | స్త్రీమూర్తి |
| 47 | 7 | పరదీన | పరిదీన |
| | 11 | కనిపించుచూడు | కనిపించుచుండు |
| 48 | 22 | గనికరము | గనికరమ్ము |
| 50 | 16 | నిర్మిత | నిర్మితి |
| 52 | 11 | వర్థిల్లు | వర్థిలు |
| 53 | 5 | కవితాత్మల్ | కలితాత్మల్ |
| 54 | 4 | వేడ్కన్ | వేడ్కల్ |
| 60 | 15 | ఉన్నదొలేదో | ఉన్నదో లేదా |
| 64 | 12 | మోదంబుగూర్చి | మోదంబు గూర్చు |